# భక్తకుచేల



పబ్లిషర్సు:

శ్రీ గణపతి బుక్ డిపో,

బుక్సెల్లర్సు, బెజవాడ.

ఓం.

శ్రీరస్తు.




# భక్తకుచేల

భక్తిరసమగు నాటకము.


గ్రంథకర్త

శ్రీరామచంద్ర చరణసేవాతత్పరులగు

వురిటి బలరామదాసుగారు.



మొదటి కూర్పు 2000

ప్రకటనకర్త.

పుట్టెపు అప్పలస్వామి.

గణపతి బుక్కు డిపో, బెజవాడ.

శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలా ముద్రితము.

1933 జూలై


 [వెల 1—0—0

# పీఠిక

మహాశయులారా!

చిరకాలమునుండియు, నాకెద్దియేని భక్తిరస పూరితంబగు నాటకము రచియింపవలయునను కోరికయున్నను, రచనకు గడంగు నంతటి సమర్థుఁడగానని కాలము వ్యర్థపుచ్చుచుండ, మదీయమిత్ర మండలివారి ప్రోత్సాహ మెక్కుడైన కతంబున వారికి నిరుత్సాహము కూర్పనొల్లక నెట్టులో వ్రాయ మొదలిడి కొలది దినములలోనే పూరించి నాడను. యిందలి కథాభాగంబు కొంతకల్పించి సాంఘిక దురాచారము లనేర్గుచ్చి ప్రభాకరునిచేతను నారదునిచేతను బల్కించినాడను. రసజ్ఞులిందలి దోసంబులు మన్నించి ముందింక కొన్ని గ్రంథంబులు రచి యింప ప్రోత్సాహమీయ కోరుచున్నాడను.

మరియు నారచనకు మూలకారకులును మన్మిత్రరత్నములును నిరతము నాశ్రేయోభిలాషులును నగు పండిత పెటా వెంకన్న గారికిని తటస్థ పూర్వకముగా నాకు మిత్రరత్నములైన బాలకవి కోట వీరాంజనేయశర్మగారు దీనింబరికించి "మనవి"యను పేరున వారియభి ప్రాయ మొసంగిన వారికిని తదితర నామిత్రులకును నేనెంతయు కృతజ్ఞుఁడనై వందనము లర్పించుచున్నాడను.

ఇట్లు,

ఏలూరు,
2—7—1933

శ్రీరామచంద్ర చరణసేవాతత్పరుఁడు,
పురిటి బలరామదాసు.

# మనవి.

ప్రాజ్ఞులారా!

ఈ పొత్తము మదీయ మిత్రరత్నమగు వ్రదిటి బలరామదాసు గారిచే రచియింపఁబడియె. పరిశీలనకర్తనగుటచేఁ గొన్నిమాటలిందు వ్రాయనుంకించితిని. విదూరనియమవస్త్రాలంకార శోభిత వాగీశ్వరీ గీతకారచన ప్రావీణ్యులతో నిండియుండిన ధరామండలమునఁ, దుచ్ఛ నాయికా నాయకులనాటకమునఁ గూర్పక, నిరర్థకనవలాగ్రంథ రచనాపరనాసక్తచిత్తుఁడుగాక, భవరహితంబును, పరమపద మహామేరువు జేర్పఁ బ్రవిమల సోపానరాజంబగు భక్తిరసంబు నాధారంబుగాఁ, గృష్ణుని యనంతలీలామహాత్మ్యము నెఱుఁగఁజేయఁ, గుచేలనారదుల నాయకోపనాయకులగా నిర్మించి, భక్తిలక్ష్మి ధనలక్ష్ములచేఁ బ్రజ్ఞలఁబలికించి, ప్రీతినలఁబట్టించి, కథకుఁ గలహాశనుని బురికొల్పి, యతి గణప్రాసలక్షణఛందస్సులాదిగాఁగల నియమములఁజక్కఁగాఁ బాటించి, వ్యాకరణ యుక్తముగా నాంధ్రభాష యోషకుఁ బ్రేమాస్పదుఁడగుబిడ్డ మైనాటకమాడించి పరిపూర్ణముగా భక్తిలక్ష్మిని పరమపదసామ్రాజ్య పట్టభద్రురాలిగా సలిపి కృతార్థుండైనాఁడు. పద్యములను, గద్యములను గుఱించి చదువరులే రసాస్వాదనఁజేసి నిర్ణయింతురుగాక. మరియు, దోషములేమేనినిల్చియుండినఁ బాఠకులు మన్నించి మాకెఱిఁగించిన రెండవ ముద్రణయందు సవరించుకొందుము.

ఇట్లు బాలకవి

కోట వీరాంజనేయ శర్మ.

# ప్రకాశకుఁడు.



ఈ "భక్తకుచేల" యను నాటకము సర్వహక్కులును నాకే చెందియున్నవి. దీనిని ముద్రించుటకుగాని భాషాంతరీకరించుటకుఁ గాని ప్రదర్శించుటకు గాని నాయనుమతి పొందకయే జరుపరాదు. ఇందలి యనుబంధములు వలయువారు మాకు వ్రాసిన పంపెదము. సదరు పైషరతుల నతిక్రమించువారు మాచేజరుపఁబోవు సివిల్ క్రిమినల్ చర్యలకుఁ బాధ్యులగుదురని యిందుమూలముగా తెలియఁజేయడమయినది.

ఏలూరు.
పవరుపేట,
3—7—33.



ఇట్లు,
పురిటి సూర్యనారాయణరావు.
కాపీరైటు హక్కుదారుడు.



# నా మా ట

“కుచేల”యను నీభక్తతరంగమును యిదివరలో నెందఱో కవులు నెన్నియో పోకడలతో రచియించి యుందురు. ఆనాటకముల కన్న నిది మిన్నయని జెప్పుటకు నిందుఁ బ్రభాకర పాత్రముచే సాంఘిక దురాచారమగు మద్యపాన మహాసముద్రంబులో ముంచి భారత భావి స్థితి కొంతమెత్తిఁచూపి, సామరస్యముల ప్రోవుచేసి, హృద్యమనిపించి ప్రేక్షకుల మనంబులు ముప్పిరిగొన, లోకమునఁగల దుర్విషయముల నొక్కుమ్మడి ప్రభాకరుని పాత్రములో నిమిడ్చి, నారదునిచే, భక్తి, భాగ్యలక్ష్ములకు కలహంబు గల్పించి,భాగ్యలక్ష్మిసోఁకిన ప్రభాకరుఁడు భారతభూమికి మోఁతచేఁటనిపించినారు. యీగ్రంథకర్తగారు మేధా విశేషముచేత దేశదౌర్భాగ్యస్థితిని క్రోడీకరించెడు గ్రంథముఁలే సకృత్తు లోకములో ధనమేప్రధానమో భక్తియే ప్రధానమో నారదునిచేఁ గల్పింపఁబడిన యీచిన్నికలహములో చక్కఁగాను, హృదయానురంజకముగాను గాంచగలరు. ప్రాయము చిన్నదైనప్పటికిని, లోకవృత్తమును యిందిమిడ్చి నూతనమార్గ దర్శకులైన యీగ్రంథకర్తగారు వందనీయులు. ఈ గ్రంథకర్తగారికి నవనీతచోరుఁ డాయురారోగ్యములిచ్చి రక్షించుగాకయని కోరుచున్నాఁడను.

ఇట్లు,

ఏలూరు,
11-5-1933

పెంటా వెంకన్న,
పట్టాభి రామాప్రెస్.

Vinta. Subbareddy Garu. Telaprolu.



# ఈ నాటకమందలి పాత్రధారుల వివరము.

1. కుచేలుడు.
2. శ్రీకృష్ణుడు. (ఒకప్పుడు విష్ణుగా మారును)
3. నారదుడు.
4. ప్రభాకరుడు.
5. జయుడు.
6. విజయుడు.
7. తుంబురుడు.

స్త్రీలు.

1. వామాక్షి.
2. సుశీల.
3. ధనలక్ష్మి.
4. భక్తిలక్ష్మి.
5. రాధ.
6. రుక్మిణి.
7. సత్యభామ.

**N. B.** సమయానుకూలముగా పిల్లలు సేవకులు అవసరము.

ఓం.

# కృతి సమర్పణ.



ఏ మహనీయుఁడు మృదుభావభరితుఁడై యవని
కీర్తిగాంచెనో, యే మహనీయుఁడు ప్రేమ
స్వరూపుఁడై సరసిజాక్షునిఁ కీర్తిఁ
భక్తిమీరఁ జాటెనో, ఏ మహ
నీయుఁడు కామంబుల
బోద్రోలి
యతిథుల నత్యంత
భక్తి నాదరించువాఁడో
ఏ మహనీయుఁడు రామదాసులఁ
గూడి సద్గ్రంథపఠనంబు సల్పెనో, యట్టి
మత్పితామహుఁడగు పురిటి అప్పనాఖ్యుని జ్ఞాప
కార్థముఁ దీని కృతినిచ్చుచున్నాఁడను.

ఇట్లు

గ్రంథకర్త.

ఓం.

శ్రీ ర స్తు.

# భక్తకుచేల

## ప్రథమాంకము.

(1 వ రంగము: నారదుడు గానముసేయుచు ప్రవేశము.)

నార— భళిభళీ! నేడెంతయు సుదినము. కలహాభోక్తనగు నా హృదయవారాశియందు నానందవీచికలఁ దేలియాడుచున్న కల్పిత నాటక మాడింప యనుజ్ఞనొసంగిన యిందిరాకాంతుఁ డెంత సరళహృదయుఁడు? హే జగత్పోషకా! లక్ష్మీనారాయణా!!

సీ. పాంచాలిమానంబు ♦ పర్వెత్తి సభలోన
ప్రీతి గాపాడిన ♦ దాతవీవె
పగవానితమ్మునిఁ ♦ బగఁజూడ కలనాఁడు
రాజుగాఁ జేసిన ♦ రాజువీవె
తండ్రిదుష్టుండయి ♦ తగనిదండనమీయ
ప్రహ్లాదు నేలిన ♦ ప్రభుఁడవీవె
మతిదప్పి ప్రార్థించు ♦ మత్తేభమునుగావఁ
చక్రంబువిడిచిన ♦ జెట్టివీవె

గీ॥ కలుషనాశన! శిష్టర ♦ క్షణము జేసి
ఆదిమధ్యాంతరహితుఁడై ♦ యలరుదీవె
నీకటాక్షంబు లేనిది ♦ నిక్కువముగ
జరుగదెద్దియు జగదీశ! ♦ స్వప్రకాశ!

ఆహా! నేఁడు నన్నెంతటి ఘనకార్యమున నియమించితివి; లోక పావనియగు లక్ష్మీదేవికి నీతిగరపుటకా? భళీ! అదియు నీకటాక్షముచే నత్యంతత్వరితముగనే యొనఁగూడె. ముందిఁక జరుగఁబోవు దృశ్య మెంతయు నాకానందదాయకముగదా? హే జగన్నియామకా!

సీ॥ నీదుమాయాలీల ♦ నెరిజూపనేగదా
గరుడుని గర్వంబు ♦ వరుగఁగంటి
నీయాజ్ఞ పాలింప ♦ నేగదా సత్యకు
గర్వభంగముసల్పఁ ♦ గనులఁగంటి
నీప్రోద్బలముచేత ♦ నేత్రిదేవులగర్వ
మనసూయదుమ్రింపఁ ♦ గన్నారగంటి
నజునిపరిభవింప ♦ నమరనాయకుగర్వ
మడుగగన్నులగంటి ♦ కడుపునిండ
గీ॥ కొలదిదినములనుండియే ♦ కలహములను
లేనికతమున క్షుద్బాధ ♦ గనలియుండ
కలహభోజన మిలఁగూర్చి ♦ గాచినావు
దేవ నిన్నెన్న నిత్తరి ♦ నెవరితరము?

(ప్రక్కఁగాచూచి) అదే తప్పటడుగులను వైచుకొనుచు తుంబురుఁడరుగుచుండె? నిప్పుడే వానిఁ గలసికొనెదగాక.

[గానముచేయుచు పోవును.]

---

(2-వ రంగము. సుశీల విచారముతో ప్రవేశించును.)

సుశీ—హా! పరమేశ్వరా! మాకెట్టి యిక్కట్లు సంప్రాప్త మొనగూర్చితివి? తినుటకు తిండిలేక, నివసింప గొంపలేక, భిక్షాటన మొనర్చి యేపూటగంజి యాపూట ద్రావి, యే చెట్టు చేమల క్రిందినో దొర్లియాడు బడుగుపేదల మగు మాకీ మహోరుతరైశ్వర్యసంకలిత మొనరించి తుదకు దుఃఖమే గల్పించితివే? తినుటకు తిండిలేకున్నను, నిర్మలభక్తిని నిన్గొనియాడి, వర్తిల్లు మావధూవరుల కీధనముగాదా ముఖ్యకారణము? దీనావనా! "అన్నమో యన్నమో" యని యడలు నిర్భాగ్యుల కింతయుపకృతి గావించినను నీ కపకృతియే గలిగెను. దేవా! యెట్లయినను యానాటి కటికచీకటిన్జావనున్న మాకీపెన్నిధి దొరకెనను సంతసం బిసుమంతయు గలుగక మరింత దుఃఖమే నా కొనంగూడెనే? అయ్యో? నేనెంత మందమతిని? కరుణాంతరంగుండై మాదీనావస్థ గాంచలేక ధనము ప్రసాదింప నదియే మహాప్రసాదమని నిర్మలభక్తి మెలంగక మన్నాథునికేల యిట్టి దుర్బుద్ధి వొడమె? కటకటా? పరంధాముం డైశ్వర్య మొసంగిననాటికరుణ యట్లు మత్ప్రాణేశ్వరుహృదయాంతరాళమున పూర్వచిహ్నములుంచక యిట్టి తుచ్ఛబుద్ధినేల కలిగింపం జేసె? అయ్యో? ఎంతదుష్కార్యము మెంతదుష్కార్యము? యీ దుష్కార్యవ్యాప్తికి స్వస్తిజెప్పి నాథుండుపూర్వరీతిం జరించునా? దుస్తరమునాకోర్కె-దుస్తరము, ధనమున్నదని సారాయమునకు వారకాంతలకే వెచ్చింపకున్న బేదసాదలను పాలన మొనర్పరాదా ఘోరము! ఘోరము!! నా జీవితేశుండు సత్ప్రవర్తనా శీలుండగుట నాకనుల గాంతునా? అంతటి యదృష్టమా? హా! ప్రాణవల్లభా! నాకడుపున గార్చిచ్చుం బెట్టి దుష్ట మధుపానాసక్త చిత్తుండవై మహానంద మనుభవింపుచుంటివా? దుర్భర

దారిద్ర్యానలమునుండి విముక్తి నొందినందుల కానందబాష్పములు రాల్పుటకుబదు లీదుఃఖాశ్రువులే దిక్కయ్యెనా ? కాలమెంతలో మార్పుజనించెను? తేజఃప్రపూర్ణమైన బ్రాహ్మణవంశమున బుట్టి యెంతటి దేహ్యాకార్యాతురుం డగుచుండెను. అయ్యో ? యీ యంటరాని మద్యమునుండి విముక్తి నా జీవితేశున కిఁక గలుగనే గలుగదా ? హా ! దైవమా !

సీ॥ వచ్చులే కష్టంబు ♦ వచ్చెనా ! యింటను
నిముసము యుగముగా ♦ నేదలంచు
పలుకులేకష్టంబు ♦ పల్కెనా ? వినరాని
దుర్భాష జలధిలో ♦ దోఁగఁజేయు
మద్యంబు తగదని ♦ మరిపల్కనేరాదు
బలికినదేహంబు ♦ బగుల గొట్టు
పూర్వగాధ లోకింత ♦ పూని పల్కఁగరాదు
యన్నంత, జిహ్వమూ ♦ యంగజేయు,

గీ॥ ఏలమాకిట్టి ద్రవ్యము ♦ నిచ్చినావు
కూళధనమిల మాకొన ♦ గూర్చుకతన
పతిని బాసెడి దౌర్భాగ్య ♦ ఫలిత మొదవె
తలపధనమేల? పతిలేని ♦ తనువదేల?.

(యించుక యూరకొని) పదధ్వనియగుచున్నది. నాథుని రాకయైయుండును! (చూచి) ఔరా ! మన్నాథుఁ డెంతలో మార్పునొందెను. చూడఁజాల ! చూడఁజాల !

గీ. ఇడుమలొందుచునుండి ల ♦ క్ష్మీశు విమల
నామభజనంబె సల్పెడి ♦ నాథుడవనే
సురనుసేవించి సత్కీర్తి ♦ జూరగొట్టి
వచ్చు నాథునిఁ గనుగొని ♦ బ్రదుకుటెట్లు ?

( యేడ్చును. )

(రక్తవస్త్రములతో ప్రభాకరుఁడు సారాను త్రాగుచు ప్రవేశము.)

ప్రభా—(పకపకనవ్వి) పరువుమర్యాదలెరుగని పాడువెధవలంతా పకపక నవ్వుతారు, సారాయమంటే యంతచౌకై పోయింది. దీని మహిను దెలుసుకొన్న వాఁడెవఁడయ్యి యంటాడా? దీని కటాక్షముచేతనే ప్రభాకరుని పడవ పర్వెత్తుచున్నది. (త్రాగి శిగరెట్టు గాల్చుచు) సెబాస్? యేమిరుచి ఎంతరుచి అబ్బా! దీన్ని కనిపెట్టినవాఁడెవఁడోగాని కనపడితే కాలసినంత బహుమానమిత్తును. ఆ మెధవ యదృష్టవంతుఁడై తేగా కనపట్టానికి. (మరల త్రాగి తూలుచు)

—। కీర్తన ।—

భళిర సారా, భళిర సారా
అందమైనదీసారా.........భళి
అందమైనదీసారా! ॥భ॥
సారాబుడ్డి చంకపెట్టి
భళిరె? వహ్వా......సందెడు
చీకులు చేతబట్టి
చక్కనిసాని సరస నిలిచిన
స్వర్గముజూపున దీసారా! భళి
స్వర్గముజూపునదీసారా ॥భ॥

వీళ్ళకడుపుకాలా? సారాయమంటే దీనిసారమెరుఁగలేక వాసనంటారు? నీచమంటారు? యీసారాయి మహత్త్వము ప్రభాకరునకు దక్కనన్యులకేమి దెలియును. ఆహా! దీని నెరింగినవారలగుటచేతనే (తూలుచు,)

సీ॥ సారాను సేవించి ♦ నరకాసురుడు నాడు
భీమసేనుని బిల్చి ♦ పిప్పిజేసె

సారాను సేవించి ♦ శంకరుడలనాడు
రావణాసురు దుంచి ♦ రాజ్యమేలె
రమ్మసారా నాడు ♦ రాముండు సేవించి
బలిని భూమిని దొక్కి ♦ వామనుడయ్యె
పూజనీయంటని ♦ పరసురాముడు నాడు
ద్వారకాపురమెల్ల ♦ దూళిజేసె

గీ॥ నెంద రెండలో వీరుల ♦ నెంచనవని
మద్యపానము సేవించి ♦ మనియు తాగ
బల్కి కీర్తిని యార్జించి ♦ ప్రబలినారు
దుష్టులై సల్పుదురు నన్ను ♦ దూషణంబు.
(యిటునటు పచారు చేయుచు)

ఎవ్వడా దూషణము సేయువాడు; సేసితే సాగదీసి సాగదీసి తంతాను. తాగపోతే లోకంలో కార్యములు కొనసాగడం యెలా? యీ తడవా యెవడైన పలకరించని చెప్తాను. పట్టుకొని వడదీసి పండ్లూడగొడతాను......అరే? యేమా యీ సారాయి సౌఖ్యం, పాడువెధవలు దీని పరువెరుంగక పకపక నవ్వుతారు. యిప్పుడెవడైన నవ్వాలి, నవ్వితేనా (మీసముపై చేయివేసి) నా తఢాఖా చూపుతాను. తాగనివాడు తుచ్ఛుడు. తాగనివానిని తగలెయ్యాలి; మాటిమాటికీ మాపల్లిగాడు, మరేమనుకొన్నాడో గానిమానరా? మానరా అంటాడు. ఆవెధవకీ సారాయి మహిమ తెలిస్తేగా? యెంతో నీతి తెలిసినోడు యీడేగాబోలు. యీడ్ని చూచి నేర్చుకున్న మా యింటిముండకేమీ చెప్పనేలేము? యీదఫా చెప్పనీ, యేమయినా సరే? పెళ్లాం గిళ్లాం యెగరగొట్టేస్తా? యిదిపోతే నా ముద్దులకనకాంగి నాయొద్దయుండనేయుంది. ననుగాంచి భ్రమసిపోవు కనకాంగి దగ్గిరీ కంపుముండయిదెంత? పేరుకు పెళ్ళి; పెళ్ళాంఅన్నమాటే గాని పాడుముండ; చండాలంముండ చందికిప్పుడేగతి గలిగించానో

మాటాడితే దీనికి ఆగతే చేస్తా! హుం! ప్రభాకరుడంటే పాడు పందనుకున్నారు గామోసు! (తాగుచు)

సుశీ:—అయ్యో! యీ భయంకరాకారము కనులఁ జూడఁజాలను కటకటా! యిదియేమి? యీ రక్తాంబరములు మేనంతయు రుధిరంబై యుండెనే? హతవిధీ? యిది యెట్లంకురించెనోగదా! దైవమా! తీవ్రమూర్తివై యున్న మన్నాథు నెట్లుమాటలాడింపగలను. యేమన్న నేమి ముప్పువాటిల్లునోగదా! (సమీపించి) ప్రాణప్రియా!

ప్రభా—(గడ గడ తాగుచుండును.)

సుశీ—జీవితేశ్వరా!

ప్రభా—(శిగరెట్టు వెలిగించును.)

సుశీ—నాథా!

ప్రభా—నాకేమ్ చెప్పుడు లేదు;

సుశీ—దేవా! మన్నింపుడు మీదాసిని

ప్రభా—యేమంటావ్

సుశీ—అయ్యో! నాథా! నేనెంత యనాథనై పోయితిని (యేడ్చును)

ప్రభా—అదిగో? ఆరంభించావ్? పాడుముండా? పో? దూరంగాపో.

సుశీ—ప్రాణనాథా! నేనేల మిముగాంచి దుఃఖింప వలయును. మీరొనరించు విపరీతదృశ్యంబుల గాంచి దుఃఖించుచుంటినే గాని వేరొండుగాదు.

ప్రభా—(హేళనముగానవ్వి) హేవిటీ! విపరీతమా?

సుశీ—నాథా! కోపింపకుడు. మీదాసిపై కరుణింపుడు. నీళ్ళుచల్లారిపోవు నికస్నానము గావింపుడు.

ప్రభా—మాకేమియుద్రవద్దు నాబంగరుభామినిక్రనకాంగియింటిలో... (తాగి) వద్దు? పో?

సుశీ—(యేడ్చుచు) అయ్యో ! యీామీాధౌతవస్త్రంబులేమి ? స్నాన మేవలవదనుటేమి ? నాథా ! యీా దీనురాలిపై కటాక్షించి యీావస్త్రంబుల న్విడిచివేయుడు, లేకున్న ముప్పువాటిల్లును.

ప్రభా—పో ? ముప్పుగిప్పు ? యెవ్వడా ? ప్రభాకరునియెదుట నిలుచువాడు; అధికము మాటలాడకు చంపేస్తా ? జాగ్రత్త ?

సుశీ—నాకంతటిభాగ్యమా ! నాథా ! మీాచేతులపై వెడలు భాగ్యమునకే తత్తరమందుచుంటి.

ప్రభా—ఓసీ! ఆపనివలయుచో యిప్పుడే గావింపగలడు శ్రీప్రభాకరుడు. (త్రావును.)

సుశీ—(యేడ్చుచు) ఆహా ! ప్రియా ? యెంతటి నీచకార్యముల కొడిగట్టుకొనుచుంటిరి. యీా తుచ్ఛనారాయముపై యిచ్ఛ వీడి పూర్వగాథల నోకింతతలపెట్టరా ? అయ్యో ! యిట్టిస్థితి యెంత హీనమయ్యెను. పూర్వపుగాథల నోకింత తలపెట్టుకొన్న నా గుండెలు బ్రద్దలగుచుండెనే ? హా ! నాథా !

సీ॥ సతతంబు హరిని సం ♦ స్తుతిజేసి జీవము
గడుపుదురే యన్య ♦ కాంక్షలేక
విషయవాసనల ను ♦ వ్విళ్లూరగాబోక
నుంతురే హృదయ ♦ మత్యంతభక్తి
సర్వంబు మిధ్య యీా ♦ శ్వరు పాదరాజీవ
ములె నిల్చునందురే ♦ పుణ్యమతిని
శమనుని కాలపాశము ♦ హరిజనులఁ జే
అ వెరచునందురే ♦ ప్రవిమలమగు
జ్ఞానపూరితమైన హృ ♦ త్సరసిఁ గలిగి
యిట్టి మీావంటి సజ్జను ♦ లే ? వివేక

రహితులై సంచరింప ధ ♦ ర్మంబు నిలువ
ధరణి గోష్పాద మంతైన ♦ తావుగలదె?

(కాళ్ళమీదపడును.)

ప్రభా—(కోపమునతన్ని) నీచాత్మురాలా! నీనీతులకిదియే ఫలిత మను
భవింపుము. (కత్తితోపొడిచి) చావు ముండా చావు!

సుశీ—హా! ప్రాణనాథా! ప్రా... ణ... ము... పో... న్నది...
(తన్నుకొని) ధ... న... మా... నా... థా... (ప్రాణములు
విడుచును.)

ప్రభా—(గంభీరముగానవ్వి) నాపిశాచము వదలినది. నా కనకాంగి
యిచ్చినకత్తి రెండుప్రాణముల బలిగొన్నది. బేష్! కనకాంగీ!
నీవు శీఘ్రప్రజ్ఞురాలవు సుమా? (తెర లో.)

యిదేనా? ప్రభాకరునిగృహము...ఆఁ...ప్రభాకరా! ప్రభాకరా!

ప్రభా—(శిగరెట్టుపుగవదలుచు) ఎవడురా! పొగరుబోతు మతిలేకపిలు
స్తున్నాడు. (తెర లో)
ఎవరులోపల.

ప్రభా—ఛీ! చవటలారా! మర్యాదలేకయే మాటలాడు చున్నారు,
(తెరలో! పట్టుము. ప్రభాకరుని పట్టుడు. యనుచు రక్షక
భటులిద్దరు తుపాకులతో ప్రవేశించిరి.)

రామ—పేరయ్యా! వీడే ప్రభాకరుఁడు చంద్రముఖీ హంతకుఁడు.

పేర—రామయ్యా! చూడుమిందొక నూతన శవము గన్పడుచుండెను.

రామ—ఓరీ! పిడుగా! యెంతమోసగాడవురా! (ప్రభాకరు చేయి
పట్టుకొనును. పేరయ్యా సంకెళ్ళు తగిలింపుచుండును.)

ప్రభా—అరరే? యిదియేమి నన్నేల బంధింతురు? (విదళించుకొనును.)

రామ- ఓరీ! హంతకా! మారాడిన మూతిపండ్లూడును. జాగ్రత్త!
(లాగుకొనిపోవును.)

ప్రభా—అయ్యయ్యో! సుశీలా.........సు...శీ......

పేర—(తన్ని గెంటును.) తెర వ్రాలును.

## రంగము.

(కారాగృహము—ప్రభాకరుడు ప్రవేశము.)

ప్రభా—ఔరా! నేనిప్పు డెందుంటినో నాకే తెలియకుండెను?. ... ... ...నేనిట్టి చెరసాలావాసుండ నగుటకు కతంబేమి. యిది చెరసాల! ఆ! అదేమి యీయెదుటనిలచిన ఎఱ్ఱపాగాల రాయల జూపు లతి తీవ్రములైయుండెనేమి? నన్, వారింతగా చూచుటకు గతంబేమి? నే నేదేని నేరారోపణాచిత్తుండనైతినా? నేనేమి చేయుదును. నేనేమియు నెరుంగనే? మద్యంబు సేవించి మతిదప్పి చరియించితినా?... ... ...కల్ల! యట్లేల గావింతును యేమియు న్దోపకుండె?... ...మ... ...త్తున... ... జిక్కి...చిత్తయి కూనీల...నేమైన జేసియుంటినా అది యంతకంటె యనృతమగు; అర్ధరాత్రంబువరకు ఆతతాయి రీతి తిరిగి గృహమందు జేరిన నేకూనీల నెట్లు చేయుదును? యిది బూటకమే? యీనా ధౌతవస్త్రంబులేమి? వాటిపై నీరుధిరమేమి? ... ... ...రుధిరమెట్లు వచ్చును. (కంపముతో) చతుర్దశ భువన పరితాపకారణ పాపానల కీలాసందోహపూరిత దేహుండనై పరిహాసాస్పదుండగా పరిగణింపబడుటకు ప్రబల కారణమేమైయుండును... ... ... లేకున్న? యీ...రక్తపూరిత మేమి? ...యేమియున్దోపకుండెను...యేకారణములేకున్న యీకారావాసమేల ప్రాప్తించెను. ఏల ప్రాప్తించెను. ఏమిచేసి... ... తిని... ...నేనే... ... ...మిచేసితిని. నామతి భ్రమించెను. భ్రమించి పోవుచున్నది. నేనిప్పుడెద్దానికై పరితపింపుచుంటిని. ...ఆ! కాదు?...నే...నేను...నాచేత హతుండై నానామమాత్రంబుచేత నరకకూపమునజిక్కిన నరాధముండెవ్వఁడు? ఆజన్మాంత సుకృతార్థము హరింప యీ పాడు ప్రభాకరుని హ క్షేపం కేసుహంబులన్బడిన యాపాడువ్యక్తి యెవ్వాడై...

...యెవ్వరైయుండునోగదా? ఓదైవమా ? నాకొకింత జ్ఞాపక మేల కల్గింపవు. ఓకాలమా! కాలమా! యీపాడుప్రభాకరుని పాప పంకిలము నొక్కసారితుడిచి వేయుము. యేలనాకీ దుర్గ్రహము? నేను గాకున్న రేపైనను న్యాయస్థానమున పాపాంధకార విభంజన చండతర మార్తాండుడగు న్యాయమూర్తిచే విచారింప బడునప్పుడైనను తెలియకపోదు. ఓ......యెర్రి టోపీదొరలారా! మీరేని జెప్పరాదా? యింతలోమరచితిరా నా...సారాయిచవి. యేమనుచున్నారు. మాకేమియు తెలియదనియా! నిర్భాగ్యులారా! మీరిప్పుడేల చెప్పెదరు. డబ్బు గలిగియున్న రోజులలో ప్రభాకరుని ధీరత్వములు మీపాలిటి క్షీరసాగరంబులై మద్యపాన సాగరంబున నోలలాడించినది. యిప్పుడో? కటకటాలమధ్య గాన్పించుచున్న యీ ప్రభాకరునివలన ప్రయోజనమేముండును? అందుచేతనే కాంతలను కఱకుకత్తులచే బూను రక్షకభటులను నమ్మరాదందురు? తెలసినది... తెలసినది. అంతయుదెలసినది. ఓభటవర్గమా! మీరెరింగింపకున్న పోనిండు. మీయుబుసునాకేల...(యించుక యూరకొని) ఓభరతభూమి పాలితచక్రవర్తులారా! యీదుష్ట మద్యంబు నొక్కసారిగిక్కురమనకుండ సప్తసాగరవలయవేష్టితమగు నీభూమండలంబవతల నేమండలము గలదో దానిలోనుక్కిరిబిక్కిరియై చిక్కకుండా గ్రుక్కిగ్రుక్కి యధఃపాతాళంబున కణగద్రొక్కి; మాన్యులారా! "మనయార్యశీల మేలనయ్యా" కాపాడరు?... ఓమద్యపాన ప్రీతిహాత్రులగు మత్సహోదరులారా! పాలితుల యవిధేయ పరిపాలనానలమున బడకమీరు మీకేల ధనకనక వస్తువాహనాదులేల గాకున్నవారు? మద్యపానమార్గము నిర్గమించి భారతదేశ బానిసత్వమున్ద్రోలి యగ్రాధిపతులని యఖండకీర్తి నేల యార్జింపరు. తప్పత్రాగి, పోరుబోతులని, తుచ్ఛులని గీర్తిగడించి,......

ఓ, మేటిపీరులారా! యీ ప్రభాకరుగతినైన దలంచి మీ దుర్వృత్తులకేల స్వస్తి జెప్పరు?..........జెప్పుడు. స్వస్తి జెప్పుడు. చెప్పక యుపేక్షింతురేని......దుర్వృత్తు లధికమై మీకును, నాయీగతి తప్పదు. తప్పదు.......[తల మోదు కొనుచు] హా! దైవమా! నాకీగతి కల్గుటకు కతంబెయ్యది. నేను యీ బంధంబుల నిక్కువముగ నిక్కమంబన కథ తెలియ కుండెనే? నిక్కమయినకథ తెలియ.......కుం.......డెనే. ఆ! నిక్కము.......నిక్కమయినకథ.......హా! సీచా? ప్రభాకరా!!......దుశ్చరిత్రా! పడతినిజంపిన పాపఫలమా! హా! సాధ్వీ! సుశీలా! సుశీలా!(క్రిందపడి) ఓపాడుప్రభాకరా! యుత్తమకుల సంజాతుండవై, బ్రాహ్మణవంశంబున జన్మించి, ఛీ! ఛీ! నిర్భాల్పనా! జన్మించితివి! ఛీ! చావక సజీవుండవై నింకెవ్వరి నుద్ధరింప నిలచియుంటివి? ఓరీ! దుష్టప్రభాకరా!

సీ॥ విమలబుద్ధినివీడి ♦ కుమతివై తివటన్న
ధన్యులనుడి తలఁ ♦ దాల్చినావా?
సదయానుకూలయౌ ♦ సాధ్వి నిల్లాలిని
ప్రేమానురాగివై ♦ పెంచినావా?
కరుణతో గనిపెంచి ♦ ఘనుని జేసిన యట్టి
తల్లిదండ్రుల యాజ్ఞ ♦ దరలినావా?
బిడియమొందక సుంత ♦ బిచ్చమెత్తిన నిన్ను
ధనవంతు జేయగా ♦ దనరినావా?

గీ॥ నీతిమెలగిన నీబుద్ధి ♦ నీటగలిపి
పాపచిత్తుండవై నీచ ♦ కూపమందు
ప్రకలుషాత్ముఁడవైన ప్ర♦భాకరుండ!
జావకింకను నీవేల ♦ జగతిలోన?

[చలికిలబడి, నిట్టూర్పువిచ్చి] ఓసుద్యమా! పాడుమద్యమా! తేజఃప్రపూర్ణమై, నుర్రూత లూగుచున్న మహాసామ్రాజ్యంపు పునా

దులు సడల్చుటకు, కలకల లాడుచున్న మోములకు నిత్యపైశాచిక కృత్యంబులఁ దెప్పించుటకును, కరగ్రహణోపేతులగు కాంతామణుల మంగళసూత్రములు పటుక్కున త్రెంచుటకును నీవే చాలినదానవు. ఓమద్యపిశాచమా! నీవేచాలినదానవు...నిక్కముగానీవేచాలినదానవు మహామ్మారివై, దోసకారివై, దేశద్రోహివైన నీ కంత్యకాలము సమీపించు టెన్నడు? నీకు......అంత్య......కాలము సమీపించు టెన్నడు? (యుంచుక తచ్చాడి) ధనమా! తుచ్ఛధనమా!! నిన్నా సించువారి నధఃపాతాళమున ద్రొక్కుధనమా! నీమైత్రి నరకకూపము, నీమైత్రి నరకకూపము...............ధనమా! మానాభిమానములు మంటగలుపు మహామ్మారివి సుమా? ధనమా! సర్వము నీమూలముననే కావలయును గదా! శివుని యర్చింప ధనము? మోక్షసామ్రాజ్యంబు నుద్యమింప సాధనము ధనము, మోహమునకు ధనము, మోసములకు ధనము, ధనమా! నీ మహా మహిమచే, పుల్లిని పుల్లయ్యామ్మారావుగా జేసి నీవు లేకున్న వేంకటేశ్వరు లైనను "వెంకి" యనఁబడుదురుసుమా? లచ్చి? నీప్రాపులేనివా రెట్టివారైనను బిచ్చగాండ్రుసుమా? నీప్రాపుగలవారెట్టి ద్విపాదపశు లైనను రచ్చలపై కెక్కి వాదముల కధిపులై, న్యాయవేత్తలై పూజ నీయు లౌదురుసుమా? ... నీ ప్రాపుపాపము! నీప్రాపుపాపము! నరకము, మహానరకము. ఓమాయధనమా! సకలవిధంబుల ప్రభాకరుని మంటగలిపిన మాయధనమా! రాకు......నా...దరిరాకుము. నాస్మరణకుఁ జేరకుము, ఓ మహాపాతకా! ప్రభాకరా! వంశవర్ధని యగు నీయిల్లాలిని జంపుకొని నీవేలనింకజీవింతువు. హా! సుశీలా సుశీలా! వేల్పునిభంగి పూజించిదెల్పిన నీవచోనైపుణ్య మడవిగాచిన వెన్నెలయ్యెను. నాయెడ నీసుధా మధురాక్షరములు నీటఁగలసెను. ఓగృహలక్ష్మీ! మత్తేజఃపుంజమా? దుర్గుణప్రభావాంతమగు నీస్వాంతమును, కంచుకాగడాలచే, శోధింపగల ధీమంతుఁడైనను, కల్మషమనుదానిని కనజాలడు, కల్మషమను దానిని గనుగొననేరడు......

సాధ్వీ ! నీమంగళసూత్ర ప్రభావమునఁ గాదే యీ ప్రభాకరుఁ డింతవరకు మనియుండుట, నీమహా పాతివ్రత్య మహిమ నెఱుఁగ కీతుచ్ఛసుఖంబుల కిచ్చనొంది, నినునాకలికి కత్తికిన్బలినిచ్చితి...... బలి ...నాకలికి...క...త్తి...కిన్బలినిచ్చితి. సాధ్వీ ! సాధ్వీ ! యీ దుష్టప్రభాకరుఁడు యీదుష్ట ప్రభాకరుఁడు, నీచుఁడై, భ్రష్టుడై, ధనాపేక్షనుజ్జిక్కి తుచ్ఛమద్యమునుగోరి, తుచ్ఛుడయ్యెను సుమా ? సాధ్వీ ! కోపింపకు కోపింపకు (ఉలిక్కిపడి) కోపము కోపమా ! నాయిల్లాలు, నాసాధ్వికి కోపమా? యేకోశమునందైనలేని యకళంకమూర్తియగు నా సాధ్విని జంపుకొంటినే ? సాధ్వీ ! ధనము లే......ని... (నాలుక గఱచుకొని) ఓపిశాచములారా ! దుర్వ్యసనంబులారా ! నను విడిచి పెట్టుఁడు. ప్రభాకరుని కాలమాసన్నమైనది. ప్రభాకరుని కాలమాసన్నమైనది. సాధ్వీ మత్కరవాలంబున నినుగోలుపోయి యుంటి నే, యద్దాని చేతనే, మదీయ నసువులఁ బాసెద, నాయసువులఁ బాసెద, యీ రక్షకభట నిర్బంధముల కేలగుఱికావలయును? యిదే మత్తేజంబు బాపుకొందుగాక ! పేరునకు సద్వంశాంకురుండనై జన్మించి భూమికి భారమై యీదుష్టప్రాణము లనుమహామృత్యువా ! నన్నాహ్వానింప వేల? యన్నిటికిన్నాఁపి యసువులుబా యసిద్ధపడియున్న నన్నేల రమ్మని కనుసంజ్ఞ జేయవు ? ఆ!...యిదే వచ్చుచుంటిని...యీ ప్రభాకరుజీవితము నెఱింగిన మహాజనులారా ! దుష్టవ్యసనములన్విడుడు. విడుఁడు. హే ! భవబంధవినాశనా ! ఈ క్రూరుని నొక్కసారి స్రుక్కడగించి నీలోఁ జేర్చుకొనవే ! జేరపకున్న నా కేదిదారి...దారి...నాకేది... దారి...దీనజనావనదీక్షాపరతంత్రా సర్వసర్వంసహాజగన్నియామ కా రావే? కావవే, బ్రోవవే

—॥ కీర్తన ॥—

బ్రోవా ! రావా ! రావా ! భ్రష్టుఁడన్ బ్రోవా ! రావా !
ఏరా! సైపా ! జాలా ! ఘోరానన్, కావవేలా ! ॥బ్రో॥

**గోషా, బాలా!! పాపా - తాపా మోపజాలా॥**
**పరమపురుష, బ్రోవవే, పతితా! పావనా! ॥బ్రో॥**

ఓ పవిత్ర కారాగృహంబా! దురితాత్ముండైన యీ ప్రభాకరుని యసువులంబాపి కృతార్థుం జేయుము. ఓ జగజ్జననీ! భారతమాతా! నీచాత్ముండైన నీపుత్రుండ స్తమించుచున్నాండు. అస్తమించుచున్నాడు,.........(దుఃఖపూరితుండై ఘోషించుచూ భరతమాతకు జై! యని తన శిరము పగులగొట్టుకొని మరణించును.)

తెర వ్రాలును.

గద్య:—ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష లబ్ధకవితా సంపన్న
పురిటి పయఃపారావార రాకాసుధాకర, అప్పన పట్నాయక్
పౌత్ర నరసయ నరసమాంబా జ్యేష్ఠ పుత్ర,
బలరామదాస, నామాంకిత ప్రణీతంబైన
భక్తకుచేల నాటకమందలి
ప్రథమాంకము.

16

ఓం.

# భక్తకుచేల

## ద్వితీయాంకము.



[రంగము. పరివేశము,నారదుఁడు తుంబురుని వెంటనిడుకొని.]

నార—తుంబురా! కనుగొంటివే యీ చిత్రనాటకము?

తుంబు—నారదా! యీనాటకమేమో, నీమాటలేమో, నాకంతయు చిత్రముగానే యున్నది.

నార—తుంబురా! యిందాశ్చర్యమేమి? వైకుంఠంబున మొన్న భక్తిలక్ష్మి ధనలక్ష్ముల వాదప్రతివాదములచే యీ చిత్రనాటకము సృష్టింపఁబడె? నందొకటి తిలకించియేయుంటివిగదా?

తుంబు—నారదా! గడచినగాథయందు దాప్రభాకరుని మహానీచునిజేసి జంపివేసినారేమి? యీ యుగంబున నిట్టి కల్లోలముల కాటపట్టేయనగునే?

నార—తుంబురా! యింతమాత్రముననకే వెరగందునదేమియు గానరాదు. రాబోవు కలియుగంబున జరుగు కల్లోలములు మజ్జనకుండు దెల్ప వింటి. నందు గొలది విషయమాలింపుము. ఎట్లన;

సీ॥ పదవుల కాశించి । భార్య నుద్యోగుల
జేరిచి జీవింప । గోరువారు
రాజ్యకాంక్ష వహించి । రహిసత్య జనులకు
గోర్కెతో నిడుముల । గూర్చువారు
దేశరక్షణజేయు । తేజః ప్రపూర్ణుల
కారాగృహంబుల । కంపువారు
న్యాయమిట్టిదటంచు । న్యాయదృష్టిని వీడి
బరులకొంపలుమాపి । బరగువారు

గీ॥ కూటసాక్ష్యంబు లెన్నియో । కూయువారు
కపటవర్తను లెందరో । కలియుగమున
బరగి భారతదేశముఁ । బరుల కిచ్చి
బానిసత్వముసేతురు । పశువులట్లు.

సీ॥ అస్పృశ్యులన్గాంచి, । యంటరాదని పారి
నీతిహీనులమైత్రి । నెరపువారు
పంచములను ముట్ట । పాతకంబనియెంచి
మాంసభక్షణజేసి । మనెడివారు
మత్తెక్కి తుచ్ఛులై । మధుపానముంజేసి
భార్యలఁబడద్రోసి । బాదువారు;
దేశదారిద్ర్యంబు । దీసివేయుమహాత్ముఁ
దలపక దూషణ । సలుపువారు

గీ॥ క్రూరకర్ములు కుమతులు । కుటిలమతులు
దేశద్రోహులు, నీచులు, । దిమ్మరిండ్రు
తిన్నయింటికి వాసము । లెన్నువారు !
కలియుగంబున, జనియింత్రు తెలియుమిందు

తుం——నారదా ! సుక్షేత్రంబైన యీ భారతభూమి కెట్టి యిక్కట్లు

రానున్నవి. ఇట్టి ఇక్కట్టులకుఁ గుఱియగునీచుల నాబమ్మదేవర సృష్టిచేయకున్న నెద్దియుఁ జరుగదుగదా?

నార—తుంబురా! నీతలంపెట్లు జరుగు? కాలమున ననుసరించి కథలు జరుగు. నాతియేగాక పూర్వంపు పరిమాణంబు లిప్పుడు సరి యగుచుండెనా? యట్లేమార్పునొందు? గావున...

తుం—(మాటకడ్డుపడి) నారదా! ముందిప్పు డేదారిబట్టవలయునో యెఱిఁగింపుము. కాలము వృధాపుచ్చకుము.

నార—తుంబురా! గడచిన కథకంటె మున్ముందు కథ ముక్తిదాయకము. అట్టి కథకు నాయకులై మూలనున్న తపసిపల్లె కేగుదమురమ్ము.

గీ॥ కుడువకూడును లేకను ♦ నిడుమునొందు,
తపసిపల్లెను, భక్తితో ♦ దనరుచున్న?
పావనుల గాంచ నామది ♦ బల్లవించె?
నెట్టికథ ముందుగల్గునో ♦ నెరుగజాల

(తుంబురుని లాగుకొని పోవును.)

తెర వ్రాలును.

—[○]—

ద్వితీయ రంగము.

(తపసిపల్లె పిల్లలతో వామాక్షి ప్రవేశము.)

వామా—హా! పరమేశ్వరా! మాకీలేమిబాధ దొలఁగుమార్గము లేనేలేదా? కటకటా?

గీ॥ ఆత్మకిసుమంత నానంద ♦ మందనీదు
ఘోరదుఃఖంబు లెన్నియో ♦ గూర్చుచుండు

పరుల పరిహాసమునకు చే ♦ పట్టుకొమ్మ
లేమికంటెను పాపంబు, ♦ లేదు జగతి!

దీనజనావన దీక్షాపరతంత్రుండవని వేదంబు లుగ్గడింపుచుండెనే? దేవా! పొట్టచేతపట్టుకొని కావుకావుమని యేడ్చు కసుగాయలతో కంటనీరు కాలువలపగిది పారునట్లేడ్చు దీనులపై, నీ కరుణాకటాక్ష వీక్షణమేలజూపవు? దయానిధీ! ముండెట్టి కుటిలాత్ము రాలినై వర్తిల్లితినోగాని యీదుర్భర గర్భనిర్భేద్య దావానలమునఁబడి మ్రగ్గుచుంటిని. ఇయ్యది భరింప నశక్య మశక్యము! మూడునాళ్ళ నుండి దోసెడుగంజి లేక శవములభంగి వసుధఁగూలి యార్తనాదము సల్పు పసిపాపలఁగాంచ నాకడుపురంపమునగోయు నట్లగుచుండెనే? యెంతటి యాగర్భదరిద్రులమైనను, విడువక నీపదసరసిజ మకరందాస్వాదనాసక్తచిత్తులమై మెలఁగు మాపైనింత నిర్దయయా? దేవా? కృపాళూ? నీపతితపావననామ మెందుదాచితివి? యేరిరక్షించి దాని సార్థకమొనరించుకొందువు. భక్తవత్సలా! మహానందకలితులై, యాగర్భ శ్రీమంతులై సంతానబీజ మంకురింపలేదని! విలవిలలాడు వారలనొద్దవారల నావించి, పొట్టపోసికోజాలని మాకీ యిరువదేడ్గురు పాపల నేలప్రసాదించితివి? దేవా! యీ మొండెకట్టెకు లేమి భాధ బాయజేయవా? అయ్యో? నాగోల యడవిగాచు వెన్నెల చందమాయెనే? దుర్విధీ! నేనొకరి నిందింపనేల?

గీ॥ పూర్వమున దా నొనర్చిన ♦ పుణ్యమెల్ల,
మారు నీరీతి సిరులుగ, ♦ మహినిఁ జూడ
తానుజేసిన కర్మమే ♦ తనకు దుఃఖ
సాగరంబున జొన్పించి ♦ సమయజేయు.

(పిల్లలు రోదనము చేయుదురు.)

అయ్యో? బిడ్డలారా! మీ రోదనము మాన్పింప నాకడ నేమియు లేదే? (దుఃఖముతో) నే నెట్లు సైరింతు? యీ యాకలి

బాధలు సమయు టెట్లు ? (గానము వినిపించును) యెవ్వరి దీగానము. [పరికించి] నారదమహర్షియని దోచెడిని, (చూచి) సత్యము ! ముని తిలకున కెదురేగి నాదారిద్ర్యబాధ దొలఁగుమార్గ ముపదేశింపు మని యెద, (నెదురేగ)

(నారదుఁడు ప్రవేశము.)

మహాత్మా ! నారదా ! కుచేలుని ధర్మపత్ని మీకిదే ప్రణ మిల్లుచున్నది.

నార—అమ్మాయీ! సుమంగలివై, దీర్ఘాయుష్మంతు రాలివిగమ్ము-

వామా—మహాత్మా ! మీయాశీర్వాద ప్రశంసయు నిటులేవచ్చెనా?

నార—కుమారీ ! అదేమి ? నేనేమియుఁ బొరపడి యుండను గదా ?

వామా—మహాత్మా ! సర్వజ్ఞులరగు మీ రెరుఁగని దేముండును? పొట్టపట్టుకొని యన్నమో రామచంద్రా ! యని యల్లాడు చున్న నాకీదీర్ఘాయు వేల కోరవలయు? దేవా ! మీ యాశీ ర్వాదము ప్రకార మేమి శుభమనుభవింప వలయును. నేనెట్లు మనజాలుదు. (దుఃఖించును.)

నార—కుమారీ ! వామాక్షీ ! త్రిలోకసంచారినగు మీ యుదంత మంతయు నేనెరుఁగనిదిగాదు ! కష్టకాలమున నే యోర్మివహింప వలయును. మహాభక్తిసంపన్నుఁడగు కుచేలుఁడను మహాఋషికి సాధ్వివై, నీవిటు విషాదానలమున గ్రమ్మగరాదు. కష్టసుఖములు శాశ్వతములా? నీవెరుఁగని ధర్మములు గలవే?

వామా—మునిచంద్రమా మీరు పుట్టుబ్రహ్మచారులు గనుక మీరీ సారహీనమైన సంసారబాధల నెరుఁగరు. యీపిల్లల యార్త నాదము వినుచుంటిరిగదా ? నేనెట్లుమనుట?

ఆ॥ వె॥ కడుపు చేతఁబట్టి ♦ కటకటఁబడి నశ్రు
జలము సుతులురాల్ప ♦ కులుకుమనుచు

ప్రాణపంచకంబు ♦ బాధించునట్టి సం
సారజలధిదాట ♦ సాధ్యమౌనె ?

పేదరికంపు బాధలు భరింప మహాకష్టము. పతితో మొరపెట్టుకొన మారుపలుకనితరి,యీబాధలకుఁ గ్రుక్కి దిప్పికొనలేకుంటిని. నాకిప్పుడేదిదారి? మహనీయా! యీదుర్భర గర్భదారిద్ర్యము తొలఁగుటకేదేని మార్గము పదేశించి నను విముక్తురాలినిఁగావింపుడు.

నారా—కుమారీ ! నీవిట్లు దుఃఖపూరితురాలివై యుండిన నేనేమియు నుడువజాలను. ఇట్లు విచారమునుండి నిర్గమించి నాపల్కు లాలింపుము.

సీ॥ పసిపాపలెంతయు ♦ పడరానిబాధలు
పడుచుంటిరని చింత ♦ పడకుమమ్మ !
పతిపల్కకుండిన ♦ గతిలేదటంచును
దుఃఖవారాశిలో ♦ దోగకమ్మ !
లేమిని బాడగాంచి ♦ నీమదినలయించి
పడతిరో ! యసువులు ♦ బాయకమ్మ !
తపసియై శ్రీహరి ♦ జపమునే తన్విగా
గడుపు నాథుని సేవ ♦ విడువకమ్మ !

గీ॥ సతముకృష్ణుఁడు మిముఁ గృప ♦ సాకునమ్మ !
భాధలనువీడ నోపికఁ ♦ బట్టుమమ్మ !
స్థిరతరంబైన కీర్తి నా ♦ ర్జింపుమమ్మ !
మానినీమణి చింతను ♦ మానుమమ్మ !

తల్లీ ! యిట్టిస్వకుటుంబ క్షుద్బాధల కేగనలినయాశ్చర్యకరము. మున్నెందరు మహామహులు మెనలేని బాధలు నొందలేదు. వారికంటె ముందింక రాబోవు కలియుగబాధల చెప్పనోరాడదు. జననీ! నీవుసర్వజ్ఞరాలవు, నీకుఁ దెలుపు నూతన విషయంబు లేవియుగానరావుగాని కలియుగమున భారతీయులు కూటికిమాడి మహాకష్ట పరంపరలకు లోనై యున్నతరి వారినుద్ధరింప నొక మహాత్ముఁడు.

గీ॥ అమలశాంతస్వరూపుఁడై ♦ యవతరించి
యరసి ప్రజగావ సత్యాగ్ర ♦ హంబుఁబూని
సలుపఁజాలును ధర్మ సం ♦ స్థాపనమును
భారతీయుల దారిద్ర్య ♦ బాధఁ తొలఁగ ?

అట్టి మహనీయుండు జన్మించి దుఃఖవార్నిధిన్మునిఁగిన జనములను నుద్ధరింప నెంచి తాను భరించిన మహాకష్టము లిట్టివని పలుకనలవిగాదు. కుమారీ! యీవిపుల కథాభాగం బెరింగించిన యులుకు జనించి దండనాయత్తమై రసభంగమగుట నిక్కము. మరి యొక మాట.

గీ॥ శాంతి స్వాంతాభిలాషికి ♦ సర్వజగము
వంగిదిరుగుట సత్యము ♦ వసుధలోన
సాధ్వి నీపతియంతటి ♦ సాధుగాన ?
కల్గు ముమ్మాటికిని మీకు ♦ కామితంబు.

కావున నేనొక సదుపాయం బెరిఁగింతు వినుము. తొల్లి నీధవుఁడు వాసుదేవునకు చెలికాడై యిరువురు సాందీపునికడ విద్యనేర్చిన వారలు. జగన్నాటక సూత్రధారియగు నామురారికి యాత్మహితుండైన నీపతి నాతని కాంక్షింపనలయునేగాని గాసిదెద్ది ? గావున నీనాథు నెట్లయిన ప్రోత్సాహపరచి బనిపిన సర్వోత్కృష్టము. మీకు తప్పక శుభంబు లీడేరును. నీవింక వెడలి నా ప్రయాణమునకు తావునిమ్ము.

వామ——జనకా ! మన్నాథుఁడు నామాటలే పీనులఁజేర్పరే ? యట్టి తరి నారోదన మరణ్యరోదనమైనదనుట సందియమా? యిదేటి యడియాస ? నా కెటును పాలుపోకుండెను. గాకున్న, నా యందు కరుణించి యాసాధున కీగాథ మీరే తెలుపరాదా ? పుణ్యముండును.

నార——బాలా ! చింతింపక సంశయనివృత్తిజెంది నీ సాధునితో మాటలాడి పనుపుము. యీ కార్యము నీ వల్లనే జరుగును. తడవానర్ప కేగుము.

హామా— మహాప్రసాదము. (నమస్కరించును.)

నార— చింతితకార్యసిద్ధిరస్తు. నేనింక వెడలెద.

(నిష్క్రమింతురు.)

తెరవ్రాలును.

గద్య:- ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష లబ్ధకవితా
ధౌరేయ బలరామకవికృత కుచేల నాటకమందు
ద్వితీయాంకము,
సమాప్తము.

ఓం.

# భక్తకుచేల

## తృతీయాంకము.

---

(నిద్రాగరిష్ఠుఁడై కుచేలుఁడు కూర్చొనియుండగా తెరలేచును.)

కుచే— హేభక్తవత్సలా! లక్ష్మీకళత్రా!

ఉ॥ వారిజనాభ భక్తజన ♦ వత్సల దుష్టమదాపహరేంద్ర సం
హార సరోరుహాసన పు ♦ రారి ముఖామరవంద్యపాద, పం
కేరుహ! సర్వ లోకపరి ♦ కీర్తితదివ్యమహాప్రభావ! సం
సారవిదూరనందతనుఁ ♦ జాత రమాహృదయేశ మాధవా!!

(పుష్పములచే పూజించి తరువాత)

హే! జగన్నియామకా!

సీ॥ దీనమై బిడ్డల ♦ రోదన వినలేక
మొరవెట్టి నాసాధ్వి ♦ మొరను వినక
"జనక" మాయాకలిఁ ♦ గనకుంటివేమని
మొర్రోయనెడి సుతుల్ ♦ మొరనువినక
"గురు"భావమునవిద్య ♦ గూర్మినేర్పుమటంచు
మొర్రోయనెడివారి, ♦ మొరనువినక
సతతంబు నీనామ ♦ జపమె భోజనమని
అన్యయోచనలేక ♦ యంబుజాక్షి!

గీ॥ నిన్ను నమ్మినవాడను ♦ నిరుపమాన
నిర్దయంజూడ పాడియే ♦ నిష్కళంక?
వేగమరుదేరినీమూర్తి ♦ నిగమవినుత !
జన్మతరియింపఁ జూపవే♦సదయపాల.

దేవా! లోకసంరక్షకా! దుర్భరభూయిష్ఠమయిన, యీధరా మండలంబున నన్నునిచి సారహీనమయిన సంసార సాగరమునముంచి దరిజేరనీయక, విచారభరంబునే, యేలగూర్తువు? నిర్మలతేజో విరాజ మానమైన నీదివ్యసందర్శన భాగ్యమే దిక్కని నమ్మిన నాకేల నీదర్శన భాగ్యంబొసంగవు? దేవదేవా! యనంతా! మున్నెందరి భక్తశిఖా మణుల కాదర మొసంగి కాపాడితివి? వారిచ్చిన బహుమతియేమి నే నీయకున్నదేమి? నాదారిద్ర్యానలము ధ్వంస మొనర్చి నీ దివ్యసుందర సందర్శన మొసఁగుము. (కరములు ముకుళించి భక్తి పరవశుఁడై యుండగా వామాక్షి ప్రక్కనుండి ప్రవేశించును.)

వామా—(నమస్కరించి)

గీ॥ ప్రాణనాయక సంతత ♦ భవవిదూరు
నామస్మరణంబె సల్పుచు ♦ విమలబుద్ధి
మెలగు మార్గోపదేశ, మ ♦ మేయభక్తి
బరగనీయక సంసార ♦ బాధగూర్చి
మర్గ్గవిడచితిరే నన్ను ♦ మహినినాధ॥

మీావలె విచ్చలవిడిగ యిచ్చాలీల భక్త మార్గోపదేశము సేయక కనుల తెరువని పసికూనలతో మర్గ్గనివసమించితిరా! నాధా! నే నిక్లెంతకాలము గడుపవలయును?

కుచే—వనితా! మంచిప్రశ్న వేసితివి. వినుము. యిమ్మార్గమున కెట్టి నిరాటంకము లున్నను నవల ద్రోసి ధన్యమార్గావలంబులై వర్తిల్లవలయు. యీాజన్మకు సుఖమొకప్పుడు కలుగునను నాశ యము శూన్యము.క్షణమైనను ఆపరంధాము నిశ్చలభక్తిఁగొని

యాడిననేగాని ముక్తిమార్గములేదు. ఇది యొకరు నేర్పునది గాదు. నీవెరిఁగియు నన్నిట్లే ప్రశ్నింపుచుంటివుగదా ?

వామా—నాథా ! నాజన్మకిదియే మోక్షము యీనాటికీ స్వల్పభక్ష్యం బుగొని తృప్తినొందుదు?

కుచే—నాయకీ ! యేపూట కాపూట కేవియోభక్ష్యంబులు గూర్చుచునేయుందువు. (భుజింపుచు) మానవతీ ! శ్రీమన్నారాయణ చరణదాసులమగు మన కీవిషాదములతోను పనియేమీ? నీ వెప్పుడును యిహబాధలకులోనై కృశింపుచుందువు.

వామా—నాథా ! కారణములకేమి ? మీరెరుంగనిదా ? సతతము శ్రీమన్నారాయణ సేవాతత్పరులమగుటచేతనే మనకీబాధలు? గాకున్న ? కరుణాంతరంగుఁడైన పరమేశ్వరునకు మన మెంతటి శత్రులముగాకున్న, పసిపాపలకింత భక్ష్యములభించుమార్గమేని జూపకుందునా ? యది యట్లు మీరేనియు నుంత యోజింపరు గదా ?

కుచే—సుదతీ ! బిడ్డల తృప్తికై మార్గ మూహింపమనియా దెల్పుచుంటివి. వారి రక్షింప నెవ్వరు సమర్థులు, వారికి నీకు బాంధవ్యమేమి ? భాగవతంబునం దేమనియుండెనో చూడు. ప్రహ్లాదుఁడు తండ్రితో ?

శా॥ "శోధింపంబడె సర్వశాస్త్రములు ర ♦ క్షోబాధ వేయేటికిన్ ?
గాథల్ మాధవ! శేము పితరణి సాం ♦ గత్యంబునన్ గాక, దు
ర్మేధన్ దాటఁగవచ్చునే సుతవధూ ♦ మానోగ్రవాంఛా మద
క్రోధోల్లోల విశాలసంసృతిమహా ♦ ఘోరామితాంభోనిధిన్."

అనిగదా నుడివెను. నిన్నుతిగారాబమున బెంచి, పెద్దగాజేసిన నీ జననీ జనకులతో, మరణింపక నన్నే యనుసరించి మెలఁగెదవు ? యెవరిమార్గంబున వారు మనియుండవలయు, నంతియేగాని హీనకరములగు బంధములఁ దగుల్కొను టెంతయు హాస్యాస్పదంబగు ? నీకీవిషయ

మెన్నియో విధంబుల నుగ్గడించితి కొలదిమైనను వీనులం జేర్పకుంటివి.

గీ॥ ఇతఁడు నాకొడుకీతఁడు ♦ హితుఁడు? తండ్రి!
యితఁడు సోదరుఁడీతఁడు ప్రా ♦ ణేశుఁడనుచుఁ
గుండెదరుగాని డెందాన ♦ మందమతులు
జూడ? నందటి భాంధవ్య ♦ మేడఁజెపుము?.

వామా—నాథా! కల్గినసంతును కలిగినటులేవిడనాడిన "అపుత్రస్య గతిర్నాస్తి" యను వాక్యార్థ మెటుసమర్థింపవలయు? అటులే గాకున్న యీకట్టెకిన్ని తిలోదకంబు లిడువారెవ్వరు ? నవమాసములుమోసి యష్టకష్టములొంది, గనినవారలఁగని నట్టులే బారవైచిన యీ వ్యామోహసంపర్కంబులేల? సతీపతులను బాంధవ్యమేల ? ఇంత నీచదాయకంబైయుండు నీస్వల్పకథకీ సంతానోత్పత్తియేల? నాథా! మీయెదుట నిలచి మాటలాడుట కేనెంతటిదానను? సర్వజ్ఞులురగు మీరెరుఁగని విషయము లేముండును ? సంసారము సారహీనమని మెరిఁగి సంతునిసార్న మొనరింపుచుండిరేగాని అబలనగు నాకీ వ్యామోహబంధములు పటాపంచలగుటెట్లు ?

కుచే—బాలా! నీకీబాధవిడనాడ దుస్తరమని వక్కాణింపుచుంటివి అయిన యనుభవింపుము.

వామా—నాథా! యీదీనురాలిపై నింతకాఠిన్యమా?

కుచే—నాయకీ! నీ దీనాలాపములను సాగరంబున నేనొకబిందువునై పోయితిని. సర్వవిషయ పారంగతవగు నీవేల నన్నిట్లు బాధింతువు? "మాతానాస్తిపితానాస్తి నాస్తిబంధుసహోదరః"యను నీశ్లోకార్థమెరింగి యుక్తనైన యీసంభాషణ ముగింపుము.

వామా—నాథా! మీరిట్లు పట్టినపట్టు విడనాడకుండిన నేజీవింప జాలను.

గీ॥ అన్నమో రామచంద్రా! యటంచుసుతులు
పెక్కుబాధలు నొందుచు ♦ దిక్కులేక

రోదనము సేయునపుడునా ♦ బాధదెలుపఁ
దరమె జీవేశ మన్నించి ♦ దాసినేలు

(కాళ్లపై బడును.)

కుచే—బేలా ! నీ గోలయంతయు నాకేల ! ఆగర్భదరిద్రుఁడనైన నాతో నీయిక్కట్టు లుగ్గడించిన నేనేమిచేయగలను? యెప్పటి ప్రస్తుతమో యప్పటి కార్యావలంబులమైననే దప్ప యన్యంబు శరణ్యంబు లెట్లగు?

వామా—నాథా ! నారోదనంబరణ్యరోదనము మాడ్కి మీకు గోచరింపవచ్చును. కాని బుడుతల యాక్రందన మాలించిన మీరిట్లనియుండరు. నేడునారదాగమనమున మనదారిద్ర్యానల తాపంబు భక్తజనరక్షాబద్ధకంకణకరకమలుండగు శ్రీమన్నా రాయణ ప్రసాదామృత రసవాహినిచే శాంతించు ననియెఱింగి తమతో విన్నవింపవచ్చితి.

కుచే—నాతీ ! యేమనుచుంటివి ? కామక్రోధాద్యరిషడ్వర్గవిదూర నిశ్చల భక్తిరసావేశ కలితుఁడగు బ్రహ్మమానసపుత్రుఁడు విచ్చేసెనా ? ధన్యురాలవు; సకల చరాచర సంఘ భవవిదూరుని దర్శనభాగ్యంబుగంటివి.

వామా—యేమినాథా ! అట్లుగుర్క విడువకుండ నొక్కటే ధోరణిగా మాట్లాడుచున్నారు. ఆయన సందర్శనములో జరిగిన సంగతి సావధానమతులై యాలకించి తదనంతర కర్తవ్యమునకు గడఁగుట మిక్కిలి శ్రేయోదాయకముగదా ?

కుచే—సాధ్వీ ! యామునిసింహుఁడేమి యానతిచ్చె ?

వామా—అయవారువిచ్చేసిన యర్ఘ్య పాద్యాది విధులాచరించి సుఖాసీనులఁ జేసినతరి యామహామహుఁ డనుగ్రహించి భూలోక స్వర్గలోకములకథ పూసగ్రుచ్చినట్లు వచించె?

కుచే—ప్రాణనాయకీ ! ఆయన మనపట్ల నిర్హేతుక జాయమాన కరుణాకటాక్షంబుచే యానతిచ్చిన ముముక్షుసంవిధాన తత్వమువివరంబుగ నెఱింగింపుము?

వామా—నాథా ! యెప్పుడును తత్వావేశంబులేనా ? దారిద్ర్యదావానలంబు దరించుమార్గమున్నదా ?

కుచే—దారిద్ర్యమను నావ నైశ్వర్యమను సాగరంబున మునిగిపోవలయుననియా భావము

వామా—నాథా ! యీ వలవంత లెట్లు సమసిపోగలవు? కావుననే నారదుఁడు, శౌరిసన్నిధికేగిన? యాతఁడు నీనాథుని కనుఁగు సఖుఁడుగాన తప్పకసిరులిచ్చి వరలుననిపలికె. గావున! ప్రాణేశ్వరా ! మీరట్లు గావించిన తప్పక మనదారిద్ర్యమడఁగును.

కుచే—నాతీ! ఆగు మాగుము. అంతయు నెఱింగిన నీవే యిట్లు పొరపడిన లోకమందుగల కాంతలెవ్వరు కాంతుని మాటలు ద్రోసిపుచ్చరు ? నిప్పచ్చరముఁ బోలిన, యీ తుచ్ఛధనము కొఱకు, శౌరిని వేడుటయా ? అయ్యయ్యో ? యింతకంటె హేయంబు గలదే ? మన్మథోద్రేక పూరితులగు మనుజులు కోరవలసిన కోర్కెను గోరితివే ? చిత్తము భగవదాయత్తము గావించు బడుగు తాపసులమగు మనము, ధనమను హాయమును, పుత్రకులను రథంబునకు పూన్చి విచ్చలవిడిగా విహారంబు సల్పుటయా ? అట్టి కోరికను శౌరిని కోరవలయునా ? అట్టి కోరికను కోరజాల ! కోరఁ జాల ? సంతతానంద చింతాకలితుండగు మురహారిని మోక్షలక్ష్మీ భరితుఁ జేయుమని కోరవలయునా ? యిప్పుడే కోరజాలుదు, అంతియేగాని ? నాతీ ! యిట్టి నీచగతంబగు తలంపు వీడుము. ఆతని కరుణయే యుండిన ?

గీ॥ తృణముసేయని దానిని ♦ క్షణములోన
ఘనతకెక్కించు మేరువు ♦ గా నొనర్చు

శౌరి ! కృపలేకయున్న నా ♦ శనమెనొందు
దేవదేవుని లీలలఁ ♦ దెలియ తరమె ?

గీ॥ సిరులుగలవార లెందరీ ♦ ధరణియందు
మెలఁగి నశియించిరో, ప్రాణ ♦ చెలియ, కనవె ?
ధనము శాశ్వత మానకే ♦ తలప ధరణి
దెలిసి యజ్ఞానమునఁ బడ ♦ దివ్యపదమె ?

గీ॥ అచ్యుతుని సిరిగోరెదు ♦ నట్టిపథము
పాముతో జెరలాటగా ♦ పరిణమించు
సాధ్వి ! నన్నేల గోరెదు ♦ సారహీన
మైనపను లాచరింపఁ ♦ జేయంగనిటుల ?

వామా—నాథా ! ప్రయత్నమున పనులు సమకూడును గాని, మీ రిట్లు పలుకుట నాకేమియు తృప్తియొదవకుండె ! శ్రీహరి సిరు లిచ్చుటకు సిద్ధమైయుండ, నాశింప మోసమని దెల్పుచున్న మీకేమి ప్రత్యుత్తర మీయజాలదును. గావున కాంక్షనొంది శ్రీహరి దర్శనయత్నము గావింపుడు ?

కుచే—వామాక్షీ ! మన యత్నా యత్నములు నిష్ఫలములు. ఎండ మావులఁగని భ్రమించిన పగిఁదియేగాని, జ్ఞానభాస్కరుని ధన గాఢాంధకారమునఁ గప్పఁ జాలముసుమా ?

వామా—(దుఃఖమై) నాథా ! మీరు పట్టినపట్టు పీడకుండిన నేమను టెట్లు ? నామొర యొకింత విని యాపై మీచిత్తానుసార మొనరింపుడు. పతికి యర్ధభాగంబు సతియగుట నాకుఁగల స్వాతం త్రేచ్ఛచే; యింతగా నుగ్గడించి బెగ్గడిలిత్తి మీరు వెడలునప్పుడు శౌరి యిచ్చినప్పుడుగదా ? వ్యర్థముగాక యర్థము లభించిన వనుకొనుట ? మీరింత కఠినముగా మాటలాడ నే నేమను కొనవలయును. బాల్యసఖుని దర్శించుటకూడ నొక దోష మగునా ?

కుచే—పొలంతీ ! నీమాటలు నా శరీరమును కంపింపం జేయుచుండె. యిట్టికార్య మొనరింపక తప్పదా యేమి? హా! దైవమా! సిరికొరకు నిను దర్శింపవలయునా? (శిరమువంచును.)

వామా—నాధా ! మీరిట్లు విషాదమున మునుగరాదు. మీరే యీనాడు ధనమాసింపపోవుటలేదు.

సీ॥ ఘనుని హరిశ్చంద్రు ♦ కడకేగి గాధేయుఁ
డడుగడే యజ్ఞార్థ ♦ మమితధనము !
గురుదక్షిణ మొసంగఁ ♦ గోరికౌత్సుఁడు రఘు
నాధునిమ్మనె పదు ♦ నాల్గుకోట్లు
బడుగుబాపనిరీతి ♦ బలిని యాచింపడే
మూడుపాదంబులా ♦ మురహరుండు
ధనదుని పజ్జకుఁ ♦ జనిశంకరుఁడుమున్ను
ధనముఁగోరగలేదె ♦ ఘనముగాను
గీ॥ ధనమునకు నిందు) డంతటి ♦ ఘనుఁడు కర్ణు
దానమడుగంగ పోవలే ♦ దేహ్యదీశ !
వారికెంతటి యపకీర్తి ♦ వచ్చెచెపుడి
ప్రీతి, హితమాలకించి య ♦ ర్థింపఁ జనుడు?;

కుచే—సాధ్వీ ! నావలెనా వారలదిరించుట? మోక్షాపేక్ష కలితులై వారర్థించిరి? వారు శ్రీహరిచింత నామృత రసగ్రహణ పారీణులు, మనము ధనకాంక్షసహితులము. నాతీ! వారికి మనకునా సాటి యీ నీసామ్యమతి నీచము.

వామా—ఎవ్వరైనను, రెండవకోర్కె మదినిడుకొనియే? మహామహితులయినారు? యాచిన్నకోర్కె యాశౌరి తప్పక నెరవేర్చును. మీకింత సంకోచమేల? మీకు బాల్యసఖుండు, దీనదయాపరుఁడునై యున్నప్పుడు, మీకు సత్కార మొనగూడకుండునా? గావున

కుచే—(వామాక్షిమాట కడ్డుదగిలి) నాతీ! ఆ లీలామానుష విగ్రహుండైన నారాయణావతారమగు శ్రీకృష్ణునకు మనసంగతి గోచరింపకుండునా? గోచరించియు మనల నిట్లే జీవనము జేయుమని దలంచి యూరకొనియె? ఆ నిగమవేదికి భూవల యమున గోచరింపనిదేది?

వామా—నాథా! బ్రహ్మాండములు కుక్షినింపుకొన్న పరబ్రహ్మ మెఱుంగనిదేముండును? గౌరవలె? యనుభవింపవలె? అన్నియుమనమే తర్కవితర్కములు గావించుకొనిన కార్యము కొనసాగు టెట్లు? మరియు;

గీ॥ మీకుదైవము శ్రీహరి ♦ మాకుమీరు
దైవమును తల్లిదండ్రియు ♦ దాతగురువు
ననుచు మదినెరనమ్మితి ♦ నయ్య? నాథ!
తప్పుసైరించి వెడలుడీ! ♦ ద్వారకకును!

కుచే—నాతీ! ఎద్దియో యెఱింగించితివి. మనంబొప్పకున్నను, మరులు గల్పించితివి. గానినే వెడలి? యామకుందునేమని! యర్థింప వలయునో గోచరింపకున్నది.

వామా—హృదయేశ్వరా! దయాంతరంగుఁడగు పరమేష్ఠినర్థింప వలయునా? మీరనినట్లు నిగమవేది యెఱింగియే సిరులిచ్చి గాచును.

కుచే—యేది యెట్లున్నను మద్బాల్యమిత్రుని దర్శింపనేగు కాలమంకురించె? (ప్రకా॥) మానినీ!

క॥ సదయుం కడకు దరిద్రుం
డథవా పోరానిపట్ల ♦ నరిగినచోనే
విధమున గైకొని చనవలె?
నధికములగు వస్తువులుఁ సి ♦ తాంభోజముఖీ!.

వామా.—నాథా! కంసారికి మనమేమి కానుకలీయగలము? కొండంత దేవునకు కొండంతపత్రి నీయగలమా? బుడుతలకొఱకు నిచిన యడుకులు గలవవి గొనిపొండు;

(తెచ్చి జీర్ణాంబరమున ముడివేయును.)

కుచే.—హా! పరమేశ్వరా? నీ మహామహిమ లద్భుతములుగదా? (లేచి) నాతీ! నే పోవుచుంటిని.

వామా.—మరల శీఘ్రకాలమున రండు. (దేవునిప్రార్థింపుచుండును.)

తెరవ్రాలును.

వామా.—(పునః ప్రవేశమై) హే పరమేశ్వరా! దయానిధీ!

సీ॥ బాలకుఁడైనట్టి ♦ ప్రహ్లాదు గాపాడ
నవతారమెత్తిన ♦ యట్టి ప్రేమ?
పగవాని తమ్ముఁడన్ ♦ భావంబు విడనాడి
యలవిభీషణుగాచి ♦ నట్టిప్రేమ!
దూర్వాసు గర్వంబు ♦ దూలించి యతిప్రీతి
యంబరీషుని గాచి ♦ నట్టిప్రేమ!
కరిని రక్షింప మ ♦ కరిదుంపఁగా చక్ర
మంపిననాడుండు ♦ నట్టిప్రేమ!

గీ॥ సతము నినునమ్మి ♦ సన్నుతి సల్పుచున్న
స్నేహితునియందుఁ గూడ వ ♦ ర్షింపజేసి
భక్తరక్షణబిరుదు ని ♦ ల్పంగఁ జేసి
పాలనముసేయవయ్య గో ♦ పాలబాల!. (పోవును.)

గద్య:—యిది శ్రీరామచంద్ర చరణసేవాతత్పర
పురిటి బలరామదాస కవికృతంబైన
భక్తకుచేల నాటకమందలి
తృతీయాంకము.

—[o]—

ఓం.

# భక్తకుచేల

## చతుర్థాంకము.

---

(కుచేలుఁడు ఆశ్చర్యముగా ప్రవేశించి)

కుచే—ఎటుగాంచినను నిరామయంబై యుండెనే?

ఉ॥ ద్వారకయెంతదవ్వొ? కడు ♦ దారుణమౌ భవసాగరంబునే
తీరున దాటినాఁడ వసు ♦ దేవతనూజుని దివ్యమందిర
ద్వారము నెట్లు సొత్తును వృ ♦ థా చనుదెంచితి గంసవైరినన్
జేరికినైన గన్గొనునె ♦ చిత్తమునన్ గరుణించి యిత్తఱిన్

(యించుక యూరకొని) ఔరా? లోభము నన్నెంతపనికిఁ దోలుచుండె!. ఓలోభమా!

సీ॥ ఎంచగాఁ బోనీయ ♦ వించు కంతయుగాని
వంశక్రమాగత ♦ ప్రతిభసుంత
నరయంగ బోనీయ ♦ వణుమాత్రమైనను
తులలేని యాత్మ ♦ బంధుత్వరీతి
నడువగా నీయవు ♦ కడకొక్క పనియైన
"వరణీయమౌ ధర్మ ♦ సరణియందు

కనుగొనసీయవు ♦ కలనైన నొకమారు
పరమార్థ తత్వ ♦ సంపత్సమృద్ధి
గీ॥ తలఁపగానీవు దుర్గుణ ♦ కలితమతిని
భవమహాధ్వాంత జాల వి ♦ ధ్వంస విషయ
కోటిభాస్కర సమతేజు, ♦ కోమలాంగు
సదయ హృదయార విందసం ♦ చారపరుని ?
గీ॥ అర్థమనియెడి హయముపై ♦ నధివసించి
లుబ్ధమనముల కళ్లెము ♦ లుగ ధరించి
పాలనము సేతువెపుడు ప ♦ వాసభూమి,
హీన తరలోభమా! ♦ నమస్కృతి శతంబు.

కటకటా! యీ దుష్టలోభత్వమునకుఁ జిక్కి, నాసాధ్వి నన్నింతటి నీచకార్యావలంబునిగావించె? ధనమపేక్షించి ముకుందుని దర్శించుటెంతనీచము. కుచేలా! నీబుద్ధి బుగ్గి పాలయ్యెనే? "స్త్రీబుద్ధిః ప్రళయాంత" కంబనునుడి యెఱిఁగియు మాయందగులొంటివే?

గీ॥ అన్నిటికి కడుమేలగు ♦ నాత్మబుద్ధి
దానికిన్మించు గురుబుద్ధి ♦ తలపమదిని
కల్గు పరబుద్ధిచేహాని ♦ కరమ దెపుడు
స్త్రీలబుద్ధులు ప్రళయంబు ♦ చిత్తగింప !

గీ॥ ఫలములనువీడి పచ్చికా ♦ యలనుగోరు
చందమయ్యెను కృష్ణుని ♦ సరసకరిగి
ధనముకావలెనంచుఁ బా ♦ ర్థించుచేత;
యాస దలపదు దోస ము ♦ న్నీసమేని.

కావుఁపబోవు కార్యమునకీ యోజనములేల! సరసీజాక్షుని సందర్శించి నాజన్మ ధన్యమొనరించుకొందుగాక ?

(పోవును)

---

(పునః ప్రవేశము కుచేలుడు)

కుచే—అయ్యయో ! యిదేమి ఘోరము ? కాలుదీయుటకేని వశంబు గానీయకభయంబు గొల్పు భీకరారణ్యంబులే గోచరింపు చుం డెనే ? హతవిధీ ! యీఘోరాటవిన్దాటు టెట్లు?

సీ॥ కాండుర్రి కాండుర్రి మటంచు ♦ గర్జనల్ సల్పుచు
చనుదెంచు శార్దూల చయములొకట
మత్తేభములగాంచి ♦ తుత్తునియలఁ జేసి
రక్తంబుగ్రోలు హ ♦ ర్యక్షులొకట
పర్వతంబుల భాతి ♦ పడియుండి పక్షుల
జీవముల్ గొను కొండ ♦ చిలువలొకట
ధూమంబు చెలరేగి ♦ వ్యోమమెల్లెడనిండ
నడవినిగాల్చు దా ♦ వాగ్ని లొకట
గీ॥ విషముగ్రక్కుచు వేగ బ ♦ ర్విడుచునుండి
ప్రాణముల హరించెడి క్రాచు ♦ పాములొకట
గలిగి భీతినిఁ గొల్పు నీ ♦ గహనసీమ ;
నెల్లు తరియించువాడనో ♦ యెరుకపడదు.

దైవమా ! యీ క్రూరమృగంబులగాంచిన కొలఁది నా హృదయ మవియుచుండెనే? యీ దారినుండి దొలఁగిపోవు మార్గమే గోచరింపకుండె ?

సీ॥ కాబోలు నియ్యదే ♦ కాంద్రను చుండెను
మత్తేభములదుర్రించి ♦ మనెడిరాజు
కాబోలు నియ్యదే ♦ గహన వరాహంబు
పోవుచునుండెను ♦ భుక్తికొఱకు
కాబోలు నియ్యదే ♦ కారుదున్నలఁ దిన
చాటునదాగెను ♦ శరభమృగము
కాబోలు నియ్యదే ♦ గర్భశత్రులఁగాంచి
యేగుచునుండె ఫ ♦ ణీంద్రసమితి

గీ. కూయునయ్యదెగాబోలు – గుంటనక్క–
వెరపుద్రోయగ నిటఁ బ్రిస • వించెపింది
మఱ్ఱులఁ బ్రాకుచుండెను – మర్కటములు
ఎందుఁగాంచిన మృగములే – ముందునుండు

ప్రాణసఖుఁడునా ప్రయాణమెఱిఁగి చిన్ననాటివోలె చిత్రనాటకముఁ గల్పించి యుండడుగదా ? ఆ! నేనాతని లోచనములందు గోచరింపుచుందు ? నేనంతటి యదృష్టశాలినా?...గాకేమి ; నే నన్న ప్రాణంబునైన యర్పించు మత్ప్రాణ సఖుఁడు నను మరచిపోవునా ? ఓదేవకీనందనా ? చిన్ననాటిరీతి దుఃఖవార్ధిన్ముంచక, యీ దుష్టభీకరారణ్యంబదృశ్యంబు గావించి, త్వరితగతి నీదివ్యమంగళ విగ్రహసందర్శన భాగ్యఁబొసఁగుము. (యురుములమ్రోతవిని) అయ్యో ! నభోమండలంబంతయు భయంకరమై యున్నదే ?

గీ॥ ఆకసంబున మేఘము – లలముకొనియె
నభముపైవ్రాలె నంధకా – రంబుమిగుల
అం ! మ్మనెడి శబ్దమంతయు – నధికమయ్యె
భోరుమని వానగురిసెడి – వరుసగలిగె.

మ॥ కనులుండంగనె గ్రుడ్డియట్లు సలుపంగా నంతరిక్షంబు జు
ట్టెను పెన్జీకటి; గొప్పవృక్షములు ధాత్రిన్ గూలిపోవంగ వీ
చెను జంఝానిలుఁడార్తి జెందునటుఁ గూసెన్ గ్రూరజీవంబు లీ
వనమందెల్లెడ మాఱుమ్రోగ; కనఁగా ? వర్షించునట్లయ్యెడిన్.

కాలవిధీ ! నేనిప్పు డెందు జొత్తును హే ! యదుకులభూషణా! ఇత్తరి నన్నేలకున్న నాకేదిదారి ? అయ్యయో ! వర్షమంతకంతకు హెచ్చయ్యెనే ? గోరుచుట్టుపై రోకటిపోటుపగిది నీవిపత్తంకురించెనే ? హా ! కృష్ణా !

సీ॥ బ్రహ్మాండమెల్లను • పట పట ధ్వనులతో
గాఢాంధకారము • గప్పుకొనియె

కడుభయంకరమైన ♦ బిడుగుల మోఁతలు
కాననంబంతయు ♦ కలతగూర్చె
యెడబాటులేనట్టి ♦ జడివానయేగాక
ఘనయుతమగు వడ ♦ గండ్లు రాలె
విద్యుత్ప్రకాశంబు ♦ విధముగా మెఱపులు
మెఱయుచునుండెను ♦ మింటియందు.

గీ॥ కాఱునలుపెక్కి చీకట్లు ♦ గడలుకొనఁగ
మించుకడవల నుదకంబు ♦ ముంచిదెచ్చి
గుమ్మరించిన గతివాన ♦ గురియజొచ్చె
ముసుగుఁబోసిన చందాన ♦ మోముగప్పి.

( పో వు ను. )

---

(పునఃప్రవేశము : కుచేలుఁడు )

కుచే—హే కృష్ణా ! నంద నందనా !

గీ॥ విభ్రమంబయ్యె నామది ♦ భీతికలిగె
ఎందునిల్చితో యేమైతో ♦ యెట్లు నిన్నుఁ
జేరువాడను నన్నిట్లు ♦ జెడునిభంగి
గా పరీక్షింపనెంచిన ♦ కమలనయన !

కటకటా ! ఎంతదవ్వు నడచినను ద్వారకాపురి మార్గమే గోచరింపకుండె ? ఇఁక ముందేదారిపోవలయు ? యేదారిఁ బోయిన ద్వారకఁ జేరుదు ? ఓ యాదిమధ్యాంతరహితా ! పన్నగారి ! యీ బాట నెట్లు తరింతు ?

ఉ॥ తల్లివి, తండ్రివంచు మరిదాతవు నేతవు నీవటంచు, నన్
జల్లగజూతువంచు మదిసంతసభక్తిని గొల్చుచుందు నీ
వెల్లజగంబులున్ సతతమేలుచునుండవె పుణ్యశీల ? నా
యుల్లము పల్లవింప కృపనుంప దలంతువొ శ్రీరమాపతీ !

(నిష్క్రమించును.)

(పునఃప్రవేశము ద్వారకాపురిప్రాంతము కుచేలుఁడు)

కుచే—హే? దేవాదిదేవా! నిన్ను నమ్మినవారికి నాశములేదను నుడి నిక్కముగా నాయెడ దృష్టాంతరంబయ్యె? లేకున్న? మహారణ్యమధ్యంబున భయంకర యాతనల పాలై చావనున్న నేను మరల నీచరణసేవాసాగర వీచీ విహారముసల్ప నిందరు దెంతునా? నీ మహామహిమం బెఱింగింప నేరితరంబగు? (వెనుకంజవేసి) అయ్యారే? గాన్పించునయ్యదే గాబోలు ద్వారకాపురి? ఆహా! యెంతసుందరంబై యొప్పుచుండె? (కొంతవరకు నడచి) ఓహో? యీప్రాకారంబుపై నందనంద నునిచిదానంద స్వరూపమెంత చిత్రమైయొప్పె? దేవా నీచిత్ర చరిత్రమెంతయు స్తవనీయముగదా?

సీ॥ పూతన చనుబాల ♦ భూరివిషంబుంచి
జంపనెంచియెదాని ♦ జంపినావు
విక్రమంబున నభో ♦ వీధిచేర్చఁ దృణా
వర్తునిసమయించి ♦ వఱలిగావు
అల్లుఁడారమ్మని ♦ కల్లప్రేమనుఁ జూపి
నట్టికంసుని మట్టు ♦ బెట్టినావు
తనశక్తిచేఁ బ్రాణి ♦ గణమును హరియించు
కాళీయు దున్మాడ ♦ గలిగినావు
గీ॥ దేవ నీచిత్రచర్యలఁ ♦ దెలియ దరమె?
కలుషనాశన! శిష్టర ♦ క్షణ ధురీణ!
ఎట్లుకృపఁ జూచువాఁడవో ♦ యింకమీఁద
నవ్యగుణశీల గోకుల ♦ నందబాల!

ఆహా! యొందు గాంచినను మత్సఖుని సుందర సుస్వరూపులే గోచరింపుచుండెనే?

సీ॥ పసిబిడ్డయైయుండి ♦ బండిరాకాశిని
హతునిఁజేసిన యాతఁ ♦ డితఁడుగాఁడె

( వేరొక దెసఁజూచి )

కాళీయభోగరం ♦ గస్థలంబులయందు
నృత్యమాడినయాతఁ ♦ డితఁడుగాఁడె

( యింకొక దెసఁజూచి )

గొల్లయిల్లాండ్ర మ ♦ ఱుక్కవలెల్ల గైకొని
యేనుగానను నాతఁ ♦ డితఁడుగాఁడె ?
గోధనంబులకెల్ల ♦ గొడుగుగా గిరివ్రేల
నెత్తిపట్టిన యాతఁ ♦ డితఁడుగాఁడె ?

గీ॥ మొగమునందున తిలకంబు ♦ సిగను నెమలి
పురియు ముద్దుల గురియించు ♦ మోవిపైన
మందహాసపు చంద్రికల్ ♦ మలయుచుండ
నిచట దర్శనమిడునాతఁ ♦ డితఁడుగాఁడె ?

అయ్యాదే దేవదేవుని భవనంబైయుండు. (నిష్క్రమించును.)

తెర వ్రాలును.

గద్య:— యిది శ్రీరామచంద్ర చరణసేవా తత్పర బలరామదాస
కవికృతంబైన భక్తకుచేల నాటక మందలి
చతుర్థాంకము.

---

ఓం.

# భక్తకుచేల

## పంచమాంకము.

(శ్రీకృష్ణమందిరమున ద్వారపాలురగు జయ, విజయులు.)

జయ—విజయా! మనదెసకే వచ్చుచున్న యీ బడుగుబాపనిం గాంచితివా?

విజ—జయా! జూచితి.

సీ॥ ఎడమి నూకలుగట్ట ♦ నెడమించుకయు లేక
శకలమౌ జీర్ణ వ ♦ స్త్రంబు తోడ
బెనగొన్న యాకటి ♦ పెల్లునన్గడు డస్సి
మిక్కిలి కృశమైన ♦ మేనితోడ
గక్షు కేశంబులు ♦ గడ్డంబు మీసముల్
వెరివిగట్టిన బలు ♦ తిరులతోడ
మానని దీర్ఘమై ♦ మార్గఖేదంబున
బ్రికటితంబగు బడ ♦ లికలతోడ
గీ॥ దాహమొదవిన వదన ప ♦ ద్మంబుతోడ
లావెడలి వేరుపడిన శ ♦ ల్యములతోడ
జనుల కెవ్వరికిని జూడ ♦ ననువు లేక
వచ్చుచుండెడి విప్రుని ♦ వరుసగనుమ!

జయ—యేమిరా? యీతని స్వాతంత్ర్యము ? మహారాజేంద్రులు సైతము రావెరచెడి యీ మార్గంబున కీతఁ డతిసులభముగా వచ్చుచుండెనే ?

విజ—రానిమ్ము? ఆస్వాతంత్ర్య మిప్పుడే సడలింపఁజేతు.

కుచే—(ప్రవేశించి) వీరలే జయవిజయులను ద్వారపాలురు గాబోలును. వీరిదాటి ముకున్దు దర్శించు టెట్లు ? ఐన నిట్లు సంభాషింతుగాక! (ప్రకటముగా) ఓజయవిజయులారా! మీరెంతయు ధన్యాత్ములు.

తే॥ గీ॥ శౌరి సామీప్య పదవులు ♦ సంగ్రహించి
విష్ణుసాన్నిధ్య మందున ♦ వెలసినారు
బ్రహ్మశంకరులైన మీ ♦ పాటివారు
గారు శ్రీహరిపాదము ♦ ల్ఘనతగొలువ.

సీ॥ మిముగాంచినప్పుడే ♦ మేలుగా శ్రీహరిఁ
జూచినట్లయ్యె నా ♦ చూడ్కులకును
మఱిపల్క మీతోడ ♦ మధుసూదనునితోడ
భాషించు నంతటి ♦ భాగ్యమబ్బె
మీరూపముంగాంచ ♦ నారాయణునిబోలి
గాన్పించుచుండిరి ♦ ఘనతమీర
వసుదేవసుతుఁ ♦ గాంచ వచ్చెడిజనములు
మము ముందుదర్శించి ♦ మీదహరిని

గీ॥ జూడవలెగాన శౌరికిఁ ♦ జూడమీరు
దాసులైయుండ మాబోటి ♦ తాపసులకు
లోపమికనేల హరిఁజూడ ♦ లోనికేఁగ
వచ్చినాడను కరుణించి ♦ వదలరయ్య!

విజ—ఓబడుగు బాపఁడా !

గీ॥ పదియు నార్వేల గోపికా ♦ ప్రణయవార్ధి
వీచివిహరించు శ్రీమహా ♦ విష్ణువేడ ?

శయనమునకిల్లు కట్ట ♦ గుడ్డయును లేక
విధిని దూషించు ♦ నీవంటిపేదయేడ?

కుచే—అయ్యో! ద్వారపాలులారా! మీరిట్లు ప్రసంగించుటెంత యునీచమగు? నాబోటివానికడ పరమేశ్వరుకీ యెబ్బెరకముఁ గలుగదు? గాన నన్విడచి పుణ్యముగట్టుకొనుడు? నాసంశయ నివృత్తిగండు.

జయ—విప్రోత్తమా! అట్లెన్నఁడును విడచుట జరుగదు?

విజ—మారాడక వెనకకుఁ బొండు?

కుచే—ఓభక్తులారా! మీరింత నిర్దయఁ బలుకుదురని తలంపనైతిని సుడీ? ఔరా! భక్తవత్సలుని దర్శింప నింత కఠినశాసనమా?

జయ—ఓ పరమఛాందసుఁడా వాదములాఁడక వెడలిపొండు?

కుచే—హే? యదుకులభూషణా! నీ చెలికాడు, నీ దాసుఁడు నిను దర్శింప వచ్చిన నింత పరాభవమా? ఓ పాపిష్ఠుఁడా! కుచేలుఁడా! నీయంతటి నిర్భాగ్యుఁ డెందును గానరాఁడు? కాకున్న మహాఘోరాటవులఁదాటి, బహుబాధలనొంది, దేవదేవుని దర్శింప నా దేవుని మందిరముననే నింత పరాభవంబందిన నీజన్మ తగలబడనా? యిప్పుడేమి చేయుదును? యెందుపోవుదును?యీ ద్వారపాలుర హృదయము శిలామయంబై యుండెనే? అయ్యయ్యో? యీ ద్వారపాలుర నేల దూషణ మొనర్పవలయు, దాస్యవృత్తి గావించుట, యజమాని మాటల కెదురాడకుండ వలయునుగదా? యెంతకష్ట మెంతకష్టము.

గీ॥ కరుణ కలిగియు కఠినంబు ✱ గనగవలయు
మంచిచెడ్డ విమర్శన ✱ మానవలయు
చేయగారాదు చేసిన ✱ చేటుగలుగు
కట్ట! దాస్యంబుకంటెను ✱ గలదె చెడుగు.

గీ॥ భక్తునకు భక్తజనముననే ✱ పరిభవింప
జేయ ప్రభుకంటె వేరొండు ✱ జెప్పగలదె?

మహినిదాస్యంబె ఛీ ! యివ * మానకరము?
లింతకంటెను బాపము * దేమిగలదు ?

ఓ దీనావనదీక్షా పరతంత్రా ! కళ్యాణగుణపూరిత వార్నిధీ ! పార్థసారథీ !

సీ॥ ఘోరాటవింగల ♦ క్రూరజీవులదాటి
పడరానియిడుములు ♦ బడసిబడసి
వర్షవారాసిలో ♦ బడినీదులాడుచు
పడరానియిడుముల ♦ బడసిబడసి
బహుసర్పములబారి ♦ బడిదానినిన్దాట
పడరానియిడుములు ♦ బడసిబడసి
భటవర్గమిడినట్టి ♦ పరిభవానలముచే
పడరానియిడుములు ♦ బడసిబడసి

గీ॥ నిర్మలంబైన నీపద ♦ నీరజముల
మధురమునుగ్రోలఁ జనుదెంచు ♦ మనుజుడంచు
ప్రియముజూపుచు నన్ను పా ♦ లింపుమయ్య
శుభజనాన్వేష ! మృదుభాష ! సుగుణభూష !

ఎట్టి యిడుములు నొందిననేమి ? జగన్నాటక సూత్రధారుఁడ వగు నీవే కరుణింపకున్న, మార్గ మెందుగలదు. దేవా ! నాతుదిమొర యాలించి, నీభటహృదయాంతరాళమున నీకరుణారస పయోనిధి ప్రవహింపఁజేసి నను నీపాదముకడఁ జేర్పకుంటివేని యీ ప్రాణములు పీకుట నిక్కము. (భటులతో) ఓ జయవిజయులారా ! మత్సహపాఠిని నను జూడనీయరా ?

జయ—ఏమేమీ ? మాధవుఁడు నీసహపాఠియా ? భళి భళీ ! బలే మాటన్నావయ్యా!

విజ—యీ బాపఁడు బలేపన్నగము బన్నె ? మోసములకు మేటియా? యేమి ;

జయ—(నవ్వుచు)

కుచే—ఓభటులారా! పేదవాని పల్కులు పరిహాసమని దోచెనా? యిదియు మహానందమే? గాని మాధవుఁడు మత్సహాపాఠి యగుట నిక్కువంబే!

గీ॥ సదయుఁడౌముని సాందీపు ♦ సరగఁ గొలిచి
విమలభక్తిని గొంటిమి ♦ విద్యనిజము
బాల్యసఖుఁడన మీరేల ♦ పరిహసింత్రు
నాదుపేరును విన్నంత ♦ నాసఖుండు.

గీ॥ నిజమునన్నేరు వచియింతు ♦ నిక్కముగను
బాల్యబుద్ధిని మీరిట్లు ♦ బరగుచున్న
పలుప్రశంసలు విడనాడి ♦ బాల్యసఖుని
క్షేమమెఱిఁగింపవేఁడెద ♦ కృపయుతమది.

గీ॥ ఇట్లు గావింపరేని యి ♦ క్కట్లఁబడుచు
జీవములు లెక్కచేయక ♦ చెలగి యిపుడె
వీడువాడను యతిభక్తి ♦ విష్ణుఁజేరఁ
బ్రాణహత్యయు మీకబ్బు ♦ భవ్యులార!

విజ—(జయునితో) యీ బ్రాహ్మణుం డెన్నివిధంబులు దెల్పినను నొకింతయు వినిపించుకొనకుండె? యెట్లైనను వీని వృత్తాంత మంతయు మురాంతకునితో విన్నవించుటే యుత్తమంబగు? లేకున్న యీ బ్రాహ్మణహత్యాపాతకంబువాయు! గావున నీ వేమందువు?

జయు—నిక్కము. నీవేగి దెల్పిరమ్ము?

విజ—(కుచేలునితో) ఓ విప్రోత్తమా! మీ రిటనేయుండుడు. మాధవుని కీవార్త దెల్పివత్తు. (పోవును.)

తెరవ్రాలును.

(అంతఃపురము శ్రీకృష్ణుఁడు అష్టమహిషీసమేతుఁడై)
(యలంకరించియుందురు.)

శ్రీకృ—వనితలారా! మీకేల నీసంకోచములు భక్తికిమించిన వస్తు వెందునుగానరాదని, పెక్కుసారులు వివరించినను, మీచిత్తము లన్యాక్రాంతముఁ జేయుచున్నారు.

గీ॥ తనువు గురులకు ధనమెన్న ♦ దానములకు
మనసు నిష్టదైవమునకు ♦ మరియుభక్తి;
భూతదయయును సద్బుద్ధి ♦ భూమియందు
పరగు వాఁడెన్న నాప్రాణ ♦ భక్తుఁడతివ!

సత్యభామ—కమలనాభా! కాంతాధీనుండవైన నీవు భక్తాధీనుండ, వెట్లగుదువు? భార్యలు పరివేష్టింప బహుశృంగార లోలుఁడవై నెగడునీవు, భక్తచిత్తానంద మత్తకరుండ వెట్లగుదువో? యూహింప నసాధ్యంబై దోఁచుచున్నది.

శ్రీకృ—కమలముఖీ! మీవదనములఁగాంచి మదించి మత్తకరీంద్రము నైతినని కొంటిరిగాబోలు; అదెంతయు యనృతసంఘాతపాతము. యేభక్తికమలమైనను నన్ను వేడుచున్నదో లేదో మీముఖంబులయందే గోచరింపనగు?

రాధా—అక్కలార! యిదేమిచిత్రము మారజనకుండు మనముఖములయందే భక్తులభావములు గనిపెట్ట గలడట? యీ దివ్యరూప సందర్శనుని లీలామృతము నేరికి గ్రోవశక్యము హే యసుర భంజనా! అణువుమొదలు జంగమాదివర్గంబువఱకు, కప్ప మొదలు నిప్పువరకు, జలముమొదలు యనిలంబువరకు నీకృపాపాత్రంబులై, నీచే నిర్మింపబడినవే? అట్లుగాకున్న యాది నారాయణా! రాతిలో కప్పకు, నీటిలోచేపకు, బొరియలో నక్కకు, పక్షికూటంబులకు, నీవేగాదా యాహారము లిడుచుందువు. బెంచను, ముంచను, రక్షించను, నీవేకర్తవు. భక్తుల,

భౌమామణుల మానసాపహర్తవు. ఓజగత్కళ్యాణ సంధాయకా! నీమహిమ యనంతము, నీచేతలభేద్యము; నిన్నూహింప నశక్యము, హా దీనావనా! పేరునకుమాత్రము మన్నాథుఁడవు. ప్రపంచమునంతకు శ్రీనాథుండవు. అక్కా! ఎంతని చెప్పిన యీయనంతు భావములు పూర్తియగుట; ముక్తిగనుట.

శ్రీకృ—ఓవిద్యాసారపూరితవాక్సుధా! రాధా! నీవుగ్రహించుమనదంతయు నిక్కవమేమొ? అంతమాత్రముచేతనే, యొప్పుకొనుట, యాత్మశ్లాఘ పరాయణత్వ మనిపించును.

సత్య—ఓహో? యీరాధమ్మగారి మాటలకు అయ్యగారి తాళము సరిపోయినది. భళా! భళా!

రాధా—సచ్చిదానంద పరిపూర్ణుని సంగతులు, తెలసికొనుటకు, నీయట్టి యసత్యభామలు, వేనవేలైనను తెలసికొనలేరు. నిర్వికారంబున నిత్యుండై, యగోచరుండై, లోచనగోచరంబుగాని యనంతుని మహాచరిత్రము, నీబోటి కన్నులుండియుఁ గనలేని మందమతులకుఁ దుస్సాధ్యంబుగాక, సుసాధ్యంబగునా? పసితనముననే రక్కసులను నుక్కడంచి, మహాభీకరావహంబైన కొండ కేలనెత్తి బ్రహ్మకు దిమ్మువదలించి, గోపరిపాలకుఁడై, గోపగోపికా మనోనాథుఁడై, హృదయకమలాంతర్వ్యాపియైన, కేశవుని, భవదీయనాథుని, గుణగణంబులు మదికెక్కునా? "కప్పపద్మసౌరభ్య" మెరుంగనట్లు గార్ధభము సుగంధ విలువ గనుగొనని యట్లు దగ్గరనున్నవారి కీచండతరాతి భండనుని పావనచరిత్రంబు, లెరుఁగసాధ్యమే?

సత్య—రాధా! నీకేల నింతకోపము. మాబోటి మందమతుల కెఱుకలేని సద్విషయంబు లెఱుకజేయరాదే?

రాధా—నాకేటి కోపము. ఆ సకలాంతర్యామి లీలలెరుఁగ నేరికి సాధ్యము.

సీ॥ భక్తవత్సలుఁడగు * పరమేశు మెప్పించు
చదువున్నదే భక్తి * చదువుగాక !
వేణుగానవినోదు * విశ్వాత్ముదరిజేర
నావగలదెభక్తి * నావగాక !
సర్వంసహా మోక్ష * సామ్రాజ్యమందను
సాటియున్నదె భక్తి * సాటిగాక !
కమలనాభుని శుభా * కరుని మెప్పించెడి
మార్గమున్నదె భక్తి * మహిమగాక !
గీ॥ కంసవైరితో నేవేళ * గలసిమెలసి
బరగుటకు భక్తిగాదె చే * పట్టుకొమ్మ
ఎన్ని సిరులున్న నరులకు * నేమిఫలము
భక్తి ! లేకున్న వారికి; ముక్తి ! సున్న.
అందరు—ధన్యోస్మి ! ధన్యోస్మి !

(అంత విజయుఁడు ప్రవేశము.)

విజ—వసుదేవనందనా ! జయము. జయము.
గీ॥ బాల్య చెలికాఁడు, మిత్రుఁడు * పరమబీద
నిర్మలానందు డతిభక్తి * నియమశాలి
ధరకుచేలుని పేరున * బరఁగువాఁడు
వచ్చె మీదర్శనమునకై * వాసుదేవ !

యాతని కెన్నివిధంబులు దెల్పినను, మీ దర్శనము గానీయకున్న ప్రాణత్యాగమునకే సిద్ధపడె ? యంత నాతని వారించి......
(కృష్ణుడు అడ్డుదగిలి)
శ్రీకృ—చాలునిఁక. మత్ప్రాణసఖుండగుకుచేలున కాయభ్యంతరము?
యెంతపొరపాటు గావించితివి. శీఘ్రముమే ప్రవేశపెట్టుము.
విజ—చిత్తము. (పోవును.)

శ్రీకృ—నారులార ! మదీయ ప్రాణసఖు నాహ్వానింప నేనే పోవుదు మీరిఁక భోజనసదుపాయంబు లొనర్పుడు ? (పోవును.)

(అందరుజేరి ఒకరిమొగ మొకరు చూచుకొనుచుండగా తెరవ్రాలును.)

[ వేరొక దెస కుచేలుఁడు. ]

కుచే—(మహానందముతో) ఓహో ! నే నెంతటి ధన్యతముడను?

సీ॥ నేడుగా నాజన్మ * కీడుబాపినస్వామి
రూపంబుగంటిని * యేపుమీర
నేడుగాపూతన * స్నేలగూల్చినస్వామి
రూపంబుగంటిని * యేపుమీర
నేడుగా గంసుని * నీటగల్పినస్వామి
రూపంబుగంటిని * యేపుమీర
నేడుగా పాంచాలి * నేలిననాస్వామి
రూపంబుగంటిని * యేపుమీర

గీ॥ నహహ నాస్వామి నాతండ్రి * నరయనేఁడు
కనులగాంచెడి భాగ్యంబు * గలిగెనాదు
పాపపంకిలమింకను * బాసిపోవ
బట్టెదను శౌరిపదములు * భద్రముగను !

(ప్రక్కనుండి వచ్చుచున్న కృష్ణునిగాంచి) దేవదేవా ! యిదే పాదసేవకుఁడు నమస్కరింపుచున్నాడు. (కాళ్ళపైబడును.)

శ్రీకృ—(నమస్కరింపబోవ కుచేలుని గ్రాగలించుకొని)

మిత్రమా ! నీకంటె పిన్నవాడనగు నాకానమస్కరించుట ; ప్రాణసఖా ! నిన్నెన్నినాళ్లకుఁ గలిసికొంటిని. నాయందలి కరుణా విశేషంబున, నన్గాంచవచ్చిన నినుగారవింపక, మూడునాళ్ళు బాధల పాలొనరించిన, యీమాధవునిపై కరుణించిన నమస్కారము లంది కొనుము. (నమస్కరించును.)

కుచే—ఆ ! కృష్ణా ! కృష్ణా ! దూరము దూరము?

గీ॥ నీవె సకలేశ్వరుండవు ♦ నిరుపమాన
నీవె నాపాలిదైవము ♦ నీవెగురువు
నీవెనాతల్లి దండ్రియు ♦ నీవెజగము
నీవె నన్నాకునేతవు ♦ నిష్కళంక!

అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండవైన, నీవు నన్నారవించుటయా? దేవా! నీకుమారుని నమస్కృతులందికొన వేడుచున్నాడను.

శ్రీకృ—ప్రాణసఖా! నన్నింతగా నుతియింపనేల? నేనవివేకినై మదాంధకారినై, శ్రీలోలుండనై, నినుగాంచనైతి, మన్నింపుము.

కుచే—భవదాజ్ఞ శిరసావహింతు.

శ్రీకృ—మహాత్మా! సాయంసమయ కృత్యములు నెరవేర్చుకొన పోదముఃరండు;

(ఇరువురు పోవుదురు.)

(శ్రీకృష్ణమందిర లోపలిభాగమున అష్టమహిషులతో శ్రీకృష్ణుఁడు, కుచేలుఁడు.)

శ్రీకృ—ప్రాణసఖా! కుచేలా!

ఆ॥ వె॥ తడవుదినములకును ♦ ధరణీసురశ్రేష్ఠ!
మాకుమీకు సంగ ♦ మంబు గలిగె
నడవిలో యుసిరిక ♦ నంబుధి లవణంబు
గూడినట్టులయ్యె ♦ నేడుచూడ.

కుచే—దేవా! నీసత్కృపావీక్షణంబుచే దేజఃప్రపూర్ణుఁడవగు నీదర్శనంబొడమె? నాజన్మ కృతార్థతనొందె?

శ్రీకృ—మహాత్మా! నూతన విషయంబు లెవ్వియేని దెల్పి రంజనమొనరింపుడు? చిరకాలాగమనమయిన కతంబున పెన్నిధి లభించు పేదభంగి నాహృదయసీమ యుల్లసిల్లెనుఁడీ?

కుచే—దేవా! ఆమాట నాయెడ వర్తింపవలయునేగాని? నీబోటి పెన్నిధి నాబోటిపేదకు లభించినకతంబున మద్భాగ్యము వర్ణింపనలవియా?

శ్రీకృ—సఖా ! నాకై కడు శ్రమలనొంది వచ్చినకతంబున, నీదేహం బెంతయో బడలికనొందియుండు. గాన నీ శయ్యపై బడలికఁ దీర్చుకొండు ?

కుచే—దేవకీనందనా ? బడలిక నీదివ్యసుందర విగ్రహ సందర్శనము తోడనే నశించె ?. గాన నాకేవిధమగు బడలికయు లేదు, మన్నింపుము.

శ్రీకృ—మహాత్మా ! అదేటిమాటలు, ఇం దొకింతసేపు శయనించి బడలికఁ దీర్చుకొండు;

కుచే—(శయనించును)

శ్రీకృ—(తాను కరచరణంబులు పట్టుచుండును.)

రాధా—అక్కలార ! గాంచిరే? మన్నాథుం డెంతటి కార్యమున కియ్యకొనెనో యటుజూడుడు ? ఆపేదభూసురుఁడెంతటి ధన్యుఁ డుగాకున్న;

ఆ॥ వె॥ ఉప్పునీటిలోన * నుంచిన కరణి, క
ప్పురము వీతిహోత్రు * నొరసినట్లు
వారిరాశిబడిన * వడగండ్ల కైవడిఁ
శౌరియందు మనము * సంఘటించె.

రుక్మి—రాధా ! నీవు వచించినదంతయు నిక్కవము. యీభూసురుం డెంతటి ఘనుఁడు గాకున్న మాధవునిచే పరిచర్యలందికొనునా?

సీ॥ దపమేమి జేసెనో ! । ధరణీసురుడుమున్న
పేరువిన్నంతనే । చేరెదాపు ?

రాధ:—ఆలింగనము జేసి । యతని కాళ్లుగడిఁగి
పాన్పుపై హాయిగా । బండబెట్టి

రుక్మి:—సేవకుండై భక్తి । సేవసల్పుచునుండె
నితనిభాగ్యం బింక । నెంతకలదొ ?

రాధ:—కంటిమే యిటువంటి । ఘనతాపసోత్తముఁ
గాలమందైన నే । కాలమునను ?

రుక్మి:-గీ॥ గోరిహరిఁ దాసునిగ జేసు । కొన్నదాని
గాంచితిమినేడు మనభాగ్య । గరిమచేత
రాధ:-నాధునితో గూడి మనముఁ గ్రి । న్న నమహాత్ము
విప్రునకు సేవజేతము । వినయభక్తి!
(వీవనలు చేబూని విసరుచుందురు.)

శ్రీకృ—సద్గుణవిశాలా! కుచేలా!
ఆ॥ వె॥ పెండ్లియాడినావె । పెక్కురు గొడుకులు
గలిగినారెనీకు । గ్రాసవాస
ములకు గొదవుపడక । కలుగుచున్నదియె? యే
కాలమునను నొక్క । గతిమహాత్మ!
కుచే—కృష్ణా! నీయకుంఠిత కరుణావారాశిచే వైవాహికం బొనరిం చుకొని ఇరువదేడ్గురు పుత్రులనుగంటి.
శ్రీకృ—(నవ్వి) యేమీ? యిరువదేడ్గురు పుత్రులే? బహుసంతాన యుతుఁడవైతివే?
ఆ॥ వె॥ ఇంటిలోన నీకు ♦ నేమాత్రమైనను
కలిగినట్లుదేవ ♦ కార్యమునకు
కతిధిజనుల కిడుదె ♦ "నభ్యాగతి స్స్వయం
విష్ణు" వనెడిమాట ♦ వినిప్రియమున.
కుచే—దేవా! నీదర్శనభాగ్యంబున నాకన్ని కొరంతలునుదీరె?
శ్రీకృ—కుచేలా! మనబాల్యచరిత్రపై నీదృష్టి యొకింతప్రసరింపుము. మరచితివా?
సీ॥ మనబాల్యమందున ♦ మసలిసాందీపుని
కడపఠించిన ప్రీతి ♦ వీడిచినావె?
కుచే—ఎరుగకేమి గురు ని ♦ తర యాజ్ఞచేకొన
కరుగమే? జపపరి ♦ కరములకును;
శ్రీకృ—మరలివచ్చెడివేళ ♦ మనమిర్వురముద్ధారి
దప్పియొండొరులము ♦ దల్లడిలమె?

కుచే—ఔనునిన్గానక ♦ నారాటమందినే
వడవిలో భాధలు ♦ పడగలేదె
శ్రీకృ—గీ॥ బోరుమనివానయప్పుడే ♦ గురియలేదె
కుచే—దడసి వడవడవడక మే । దైవరాయ!
శ్రీకృ-ఎంచనప్పుడెగద మిత్రి । లెదురుపడిరి;
కుచే—ఔను యట్క్రూరశారదు । లంతవచ్చె?

వసుదేవనందనా! నే నెంతయు కృతార్థుండను, ఎప్పుడును నీ నామధ్యానామృతమునే గోలుచు నన్యభ్రాంతికనువీయని కతంబున, నేడు సాక్షాత్ శ్రీకాంతునితో బాల్యక్రీడా విషయోక్తి ప్రసంగించుటచే, మహానందమొదవె, చిన్ననాటి చర్యలు జ్ఞాపకంబొడుమ (మహానందముతో) కృష్ణా! నాపై నీకింత కరుణగలదని యెఱుఁగుదు సుమా?

శ్రీకృ—కుచేలా! నాపైఁ గల ప్రేమానురాగంబుచే నటులందువు గాని, నాకడఁగల మహత్తర విషయంబేమియు లేదు. (అని శరీరము నెఱుముచు) యిదేమి యీచేలమున మూట గట్టియున్నది. నాకేమైన తాయము దెచ్చితివా? యేమి? (విప్పి తిని) మిత్రమా! యీ యడుకులెంత రుచికరమైయున్నవి.

రుక్మి—(రెండవసారి తినబోవు అడుకుల పిడికిట పట్టుకొని) ప్రాణేశ్వరా! మీ ప్రియసఖుఁలొసఁగెనని యడుకులన్నియు మీరే భుజింపవలయునా? నాకుఁ గొన్ని యొసఁగుడు?

(లాగికొనును.)

శ్రీకృ—(కోపముతో)
ఆ॥ వె॥ అధిపుఁడారగింపి । నంబు జేతుణులంతఁ
జెలగి సంతసింప । వలయుగాక
కుడువవలదటంచు । గడునడ్డుపడియెడు
కాంతలెచటనైన । గలరెజగతి?
రుక్మి—ప్రాణపతీ! మన్నింపుడు.

సీ॥ యదువీరసర్వ వే । దాంతుండ వెరుఁగవే
కరములు బట్టిన । కారణంబు?
భవదీయభక్తి రూ । పముగొన్న నీతఁడు
కానుకయిచ్చిన । కారణంబు

కృష్ణు—ఆఁ! అరయకేమి యితండు । నత్యంతభక్తిమై
నాకొసంగినప్రీతిఁ । గైకొనంగ

రుక్మి—చాలునంతకెపేద । సకలసంపన్నుఁడై
యలకుబేరునిమించు । నధిపుఁడయ్యె

గీ॥ యిపుడు మూడవపిడికెడు । నింపుతోడ
మ్రింగినంతనె మనమెల్ల । లొంగిసతము
పేర్మియితనికి చిరకాల । భృత్యులమయి
యుండవలయును యింక వే । రొండుగలదె!

శ్రీకృ—ఉత్పలాక్షీ! ఏది యెటులున్నను యీతఁడు మద్భక్తకోటి
లోనివాడుసుమా?

రుక్మి—మహాప్రసాదము. మోక్షార్హుఁడు.

శ్రీకృ—అట్లే? గాని, యీతనిఁ గొంతకాల మీ ధరావలయమున
నునిచి పిదప మోక్షపదం బొసఁగవలయును.

రుక్మి—మహాప్రసాదము.

శ్రీకృ—భక్తశిఖామణీ! కుచేలా! ఇదే యొసఁగితి, జ్ఞాననేత్రంబుల
మదీయ విశ్వరూపంబుఁగాంచుము.

(అప్పుడు రుక్మిణీ కృష్ణులు వైకుంఠమందున్న లక్ష్మీ నారాయణులై)
యుందురు)

కుచే—ధన్యోస్మి, ధన్యోస్మి, ఓమహాత్మా! దానవవంశబడబానలా!
ఏయనంతకళ్యాణగుణగణగరిష్ఠుని నామోచ్చారణ మాత్రం
బున వైకుంఠమునం దపరిమితానందదాయకమగు ముక్తిలభిం
చుచు నున్నదో? యేయాదిమధ్యాంత రహితుని లీలలు సృష్టి
స్థితిలయంబులకు గారణభూతమగుచుండెనో? యేశత్రురాడ్గర్భ

నిర్భేద భయానక శంఖ చక్రగదాఖడ్గతోమరభిండివాలాద్యాయుధ ప్రయుక్తవిజయ నీలనీరద కోమలశ్యామల మనోమోహనాకారము చరాచర పరీవృతాఖండభూమండలోత్పత్తికి హేతుభూతమో యట్టి నీనిజస్వరూప సందర్శనమునఁ జరితార్థుఁడనైతిని. హే భక్తవత్సలా!

సీ॥ ధనముగల్గియు నీదు * దాసులకీయని
వానికన్నను భిక్షు * వాడు మేలు
కన్నులుండియు నిన్ను * గననేరజాలని
వానికన్నను గ్రుడ్డి * వాడు మేలు
నోరుగల్గియునిన్ను * నోరార బాడని
వానికన్నను మూగ * వాడుమేలు
నడువగల్గియు నిన్ను * బొడగాంచనేరని
వానికన్నను కుంటి * వాడుమేలు

గీ॥ జన్మములకెల్ల ఘనమగు * జన్మమెత్తి
సారవిరహితమైన చి * త్తమున నిన్ను
గాంచకను పోవుచుంటిని * ఖలుఁడ నగుచు
దీనజనపోష ! మృదుభాష ! దివ్యవేష !.

(నుతింపుచుండ తెర వ్రాలును.)

(నారదుఁడు ప్రవేశము.)

నార—భళిరే? నేటికి నాతుద్బాఘాసంక్షోభ మంతరించినది. మదీయ మనోరథంబీడేరె. కావున వైకుంఠమునకరిగి, లక్ష్మీదేవుల మోడుగెల్పుల విమర్శనఁ గావించి నాయానందమును వెలిబుత్తుగాక!

గీ॥ పంగనామముదాల్చిన । భక్తుఁజేసె
ధనముఁగల్గిన మాతాని । దాసుఁజేసె!

సాధురూపంబుదాల్చిన । సదయుఁజేసె ?
సారసాక్షుని నిజభక్తి । సలుపకున్న
గీ॥ సర్వమునువీడి మెలఁగెడి ♦ జ్ఞానియైన
యజ్ఞములు పెక్కు సల్పు ♦ విజ్ఞానికైన
భక్తినిశ్చలమునసల్ప ♦ ముక్తిగల్గు
ధరణిభక్తియెపరమసా ♦ ధంబుచూడ !

( పో వు ను. )

(కుచేలుఁడు : ప్రవేశము.)

కుచే—(ఆనందముతో) ఆహా ! పరమేశ్వరా ! నిన్ను నమ్మినవారికి నాశముండునే ? గాకున్న;

సీ॥ ఉపవాసములచేత * నొగిలి డస్సినమేను
రక్తమాంస ప్రపూ * ర్ణతవహించె
బాగుగా చినిగిన * ప్రాతకుచేలంబు
కాంచనాంబరమై ప్ర * కాశమందె
గళమున నిడుకొన్న * తులసి పూసలపేర్లు
మౌక్తిక మణిహార * సూక్తియయ్యె
మృదుకరాంగుళముల * ముదురుదర్భలముళ్లు
ఘనమైన ముద్దు టుం * గరములయ్యె
జెవుల వ్రేలాడు బలుపుత్ర * జీవికాయ
లెలమి మణికుండలంబులై * యేపుజూపె
జెలువమంతకు హెచ్చెను * శ్రీమురారి
పరమకరుణానురక్తిని * నెరుగ తరమె ?

(ఇంచుక యూరకొని) మత్ప్రాణేశ్వరి కోరికఁగొంతయేనియుఁ దెలుపకయే తిరిగి వచ్చిన నాకీ భూషణాలంకారంబులేమి ? ఎందు గాంచినను మా తపసిపల్లెమార్గమే గోచరింపకుండె ? యెటుగాంచినను సుందరమందిరంబులే గోచరింపుచుండెనే ? (పరికించి)

గీ॥ ఈ తటాకంబుననె తొల్లి * యుంచిజూడ
స్నానసంధ్యాది సత్కర్మ * జరుపుచుండు
నదిగో ? నారావిగున్నకే * ననవరతము
పూజసేయుచు నుండును * తేజమొప్ప ?.

ననుఁజూచియే గాబోలు, నీజనముల కోలాహలంబు. ఓ జనులారా! యిదే వచ్చుచుంటి. (పోవును.)

గద్య:— ఇది పురిటి బలరామకవిచే రచియింపఁబడిన
భక్తకుచేలయందలి
పంచమాంకము

---

ఓం.

# భక్తకుచేల

## షష్ఠాంకము.



(కుచేలుఁడొక వనప్రాంతమున గూర్చొని)

కుచే—హా? కృష్ణా! తుదకు దారాసుతుల కోర్కెనే యీడేర్చి
నన్ను భూలోకముననే విడనాడితివా?

గీ॥ యేడిచెడి పిన్నవాండ్రకు ♦ నిన్నిపప్పు
గింజలిడిపోరుమాన్పిన ♦ క్రియను జాల
తుచ్ఛమగు యిహభోగము ♦ లిచ్చినన్ను
మత్తునిగ జేసినావు నీ ♦ చిత్తమికను

ఆ॥ వె॥ సకల దుఃఖములకు ♦ జననస్థలములైన
నిహసుఖంబు లిచ్చ ♦ గింప దాత్మ?
పరమపదము నీదు ♦ పాదపంకజముల
జేర్చుకొనుము నన్ను ♦ శ్రీనివాస!

గీ॥ పాలముంచిన నీళ్ళలో ♦ పలను ముంచి
నను కృపారాశి నీపద ♦ నవ్యపద్మ
ములను హృదయంబులో ♦ నుంచి లలితభక్తి
పూజసేతును మానస ♦ పుష్పములను.

(ధ్యానము నటింపుచుండ)

(శ్రీకృష్ణుఁడు అలంకారసహితుఁడై)

శ్రీకృ—భక్తబిడౌజా! కుచేలా!

గీ॥ నిజతలోదరి ప్రార్థింప ♦ నీవునన్ను
గానుపీసంబు లడుగుట ♦ కాసజేసి
వచ్చియూరకయున్ననీ ♦ వాంఛదెలిసి
యిచ్చితైశ్వర్య విభవము ♦ లింతలేసి.

గీ॥ తొల్లియునుబోలె లేముల ♦ తల్లడిలక
కన్న-నతిముదంబును ♦ గల్గి నీయాలుబిడ్డ
లెల్లసౌఖ్యంబులనొంది ♦ హితులఁగూడి
యనుభవింతురు నీ ధర్మ ♦ మున మహాత్మ!

ఆ॥ కలిమికలిగెననుచు ♦ కావరమెక్కుఁడై
బాగటుసట్టెసట్టు ♦ బొందబోక
ప్రియముతోఁడను నిరు ♦ పేదవారలఁ గాంచి
యన్నమిడగవలయు ♦ నతులభక్తి.

గీ॥ గరిమతోడ శుభస్య శీ ♦ ఘ్రిమ్మనంగ
దెలిసి యత్యంత విజ్ఞాన ♦ తేజమునను
సకల ధర్మంబులందున ♦ జాడ్యముడిగి
నన్ను పూజింపవలయు క్ర ♦ న్ననకుమార.

గీ॥ తస్కరులు భూమిపతులు వి ♦ త్తములుబలిమి
బాదివికొని పోవ జూచు ♦ చుండెదరుగాని?
యాగలిగియేరికిని జిగి ♦ నిడగలేని?
కష్టలోభుల కేల సద్గతులు ♦ గలుగు?

గీ॥ పిసినియగువాడునేగికి ♦ పెట్టినట్టు
బైసిమాలిన కృతకర్మ ♦ భ్రిష్ఠుఁడిలను
పరమచండాలుఁ డహాహా! ♦ నేషట్లనైన
దరుచుగద లోభికంటె పా ♦ తకుఁడులేఁడు

సర్వవిషయసంగ్రాహవేదియగు నీకు నేనెఱిఁగింపనేల గావున నో కుచేలా! ధనధాన్యసుఖంబులను గొంతకాల మనుభవించి నన్జేరుము. యింకొకతూరి నీదృష్టికి దర్శన మిత్తుగాక.

కుచే—మహాప్రసాదము.

(పోవును.)

తెరవ్రాలును.

---

(వైకుంఠమున లక్ష్మి కూర్చొనియుండగా వేరొకభాగంబున నారదుఁడు ప్రవేశించును.)

నార—ఇదే లక్ష్మీదేవి యాసీనమైయుండె మదీయానందవీచికలదేలి యాడింతుగాక (సమీపించి) అమ్మా! నమస్కారము.

ధనలక్ష్మి—నారదా! కూర్చొనుము. యిప్పుడెచ్చటినుండి రాక,

నార—అమ్మా! ఎచ్చటనుండి యనియా ప్రశ్నింపుచుంటివి? యీమధ్య ఘడియతీరికలేని మహాఘనకార్య పర్యవసానమునకై శ్రమ పొందుచుండి నేటి కాయుద్యోగమునకు స్వస్తిజెప్పి నిన్గాంచ వచ్చితి

ధన—నారదా! ఘనకార్యమంటివే యేమాఘనకార్యము?

నార—జననీ! సర్వమెఱిఁగి నీవిట్లు ప్రశ్నించిన నేనేమని ప్రత్యుత్తర మీయఁగలను? తల్లీ? నీసత్కృపావీక్షణమే జగత్కళ్యాణ కరంబగు; నీవులేని కార్యము లెవ్వియు నెరవేరజాలవు. నిన్ను కాంక్షించి యెందరెందరు మహావైభవంబులంది యుండలేదు?

ధన—గానవిశారదా! నారదా! సత్యము వచించినాడవు మత్ప్రభావంబు నీవెరుంగని దేమిగలదు?

నార—హే జగజ్జననీ! నీ సత్కృపలేని మానవుని జీవితము రిత్తయగునుగదా? నీకటాక్షమునకు పాత్రులయినవారి తొల్లింటి వైశ్వర్య ప్రభావం బెరుఁగ తరమా? ఓహో?

సీ॥ వినయగర్భితమైన ♦ విమలబుద్ధినివీడి
ధనమదాంధులగుచు ♦ దనరువారు
ధనమెల్లవేళ సా ♦ ధనమంచు ధరినెంచి
తొలికథల్ గానక ♦ దనరువారు
కానికార్యముజేసి ♦ కనకమేగతియని
కూటసాక్ష్యంబులు ♦ కూయువారు
శ్రీరంగనీతు లే ♦ పారంగ గూయుచు
సదయులన్దండింప ♦ జనెడివారు
తల్లి నీసత్కృపఁ గోరు ♦ దనుజసములు
కథలువర్ణింప నేరికా ♦ కాముజనని
ఎండ రెండటో ఏన్గోరి ♦ నేటబడిరి,
నమ్మనిన్బాడ దప్పునే ♦ నరకమిలను ?

ధన—యేమినారదా ! మహాఘనకార్యకథ నెరిఁగింతునని నన్నేదూర మొదలిడితివి. నీకేమయిన యున్మాదము కలిగెనా ?

నార—తల్లీ ! నీకరుణా కటాక్ష మబ్బినవారికే గాని నారదుని కేల నమ్మా, యున్మాదము.

ధన—ఓరీ ! జడదారి, కనులు దెఱచిమాటలాడుము.

నార—మాతా ! నీవుతుఁనిపై కినుకఁ బూనకుము. అఁ! యటు జూడుమ. (ముందుకునడచి వచ్చుచున్న భక్తిలక్ష్మినిజూచి) లోకరక్షిణీ ! ముక్తిసంధాయనీ ! యిదేనారదుఁడు నమస్కరింపుచున్నాఁడు;.

భక్తి—నారదా ! దీర్ఘాయుష్మంతుఁడవై వర్ధిల్లుము నారదా ! నీము ఖావ లోకనమున నేడేదియో వింతగోచరింపుచుండె? తెలియ నగునా ?

నార—తల్లీ ? నీకెఱుకలేని వింతలేముండును ... నాతి ... (లక్ష్మివంక జూపి) యోడుగెల్పుల పర్యవసానము దెలుప ... (నవ్వును)

ధన——(తనలో) అయ్యో! యీ నారదుని నాటి మానాటి ప్రీతి ఫలములకొరకా? నాపై నింత తిరస్కరణ భావముఁజూపి యుండెను. ఔరా! యీమాయనారదుండెంత దుండగీఁడు... కానిమ్ము యిట్లు సమర్థించి నైతుగాక, (ప్రకా) నారదా! నీ కెరలింపుల కిదియా, కారణము. వినుము నన్నిట్టుకొనజాలని నీచులకు నీవనినట్లు నరకద్వారమే గతియగు, ఆగర్భ దరిద్రుం డైన ప్రభాకరుఁడు నన్నిల్పుకొనలేకయేనీతివిహీనుఁడై యధో గతి పాలై నశించిపోయెను. నిక్కమునచింతు, నాయనురాగ మునకు పాత్రుండుగాని వాడెవ్వఁడును, కొఱగాడనుట యతి శయోక్తి కానేరదు.

సీ॥ నా ప్రభావము నెర ♦ నమ్మి కుబేరుఁడు
మైశ్వర్యవంతుఁడై ♦ యలరియుంట
నాకటాక్షముననే ♦ నల శచీధవుఁడును
మైశ్వర్య వంతుఁడై ♦ యలరియుంట
నాకటాక్షముననే ♦ గాకల పాండవుల్
మైశ్వర్యవంతులై ♦ యలరియుంట
నాకటాక్షముననే ♦ నాడుకర్ణుండును
మైశ్వర్యవంతుఁడై ♦ యలరియుంట

గీ॥ నన్ను గోరనివానికి ♦ తెన్నుగలదె
కాసుచేయునె శ్రీహరి ♦ దాసుఁడైన
నారదా? జ్ఞానపూర్ణ వి ♦ శారదుఁడ వె
దూరె దేలను నన్నిట్లు ♦ తుచ్ఛబుద్ధి.

నార——(నవ్వి) హే పతివతసింహాసనీ?

సీ॥ కురురాజు వంశంబు ♦ గూలిపోవుటధర
నీకటాక్షప్రభా ♦ నియతికాదె
నలరాజు పతితోడ ♦ నడవిలో గ్రుమ్మరె
నీకటాక్షప్రభా ♦ నియతికాదె

సత్యాగ్రహుల్బ్రవి ♦ సకలభాధలునొంద
నీకటాక్షప్రభా ♦ నియతికాదె
నత్యంతమైత్రికి ♦ నరయవిఘ్నముసేయు
నీకటాక్షప్రభా ♦ నియతికాదె
గీ॥ నన్నదమ్ముల విడదీయ ♦ నకటనీవె
మాన్యులను కారలోద్రోయ ♦ మహినినీవె
నీవె సర్వజగంబులు ♦ న్నీటగలుపఁ
గర్తవగు నీప్రభావంబు ♦ గాంచవశమె.

ఓ జగన్మాతా? యున్నమాటల కులుకునొంది నాతో జగడంబులాడకుము భక్తికిన్మించు వేరొండు వస్తువు గానరాదని యెఱుఁగుము. నా కింక శలవొసంగుము. తల్లీ! భక్తి! శలవా?

ధన—ఓరీ: కుటిల నారదా? 'భక్తీ, భక్తీ, యని తలమోదుకొని యెదవేమి? పక్షపాతబుద్ధి మెలంగు నీబోటితుచ్ఛుండొక్కఁడు నిందింప నాకు గలుఁగు కొఱంత యేమి? నీ వింక యిచ్చకంబులాడు భక్తి కాళ్ళపై నే దొర్లియాడుము.

భక్తి—చెలియలా! నన్నేల దూరెదవు. నిన్నెన్నఁడైన పల్లెత్తిమాటాడితినే? నారదుని మాటలకుఁ గినియకుము.

నార—ఓ తల్లులారా! మీ రిరువురిట్లు వాదులాడ విరమింపజేయ నేరికగు మీ హృదయంబులఁ రంజింపజేయ మీ నాథునకుఁ గాక యన్యులకగునే? గాన నారాయణుని నుతింత మాయత్తముగండు. (ప్రార్థింపనటింతురు)

విష్ణువు—(ప్రవేశించి) ఓ వ్యక్తులారా! మీరీ కొఱగాని వాదోపవాదంబులన్బడియుండు టింతయు నీచకరంబగు.

గీ॥ భుక్తిగల్గినవారికి ♦ భక్తిసున్న
భక్తిగల్గినవారికి ♦ భుక్తిసున్న
రెంటిసవరించుకొన్న ♦ తొల్లింటిపదవి
దొరుకుటకు సందియంబేల ♦ తరుణులార!

గీ॥ నేను నేనంచు మీరిట్లు ♦ హీనులగుచు
జల్లులాడిన కలుగునే ♦ సదయులనెడి
కీర్తిమాయదె వాద వి ♦ రక్తిమతిని
బూనుడీ సోదరప్రేమ ♦ పౌలతులార!
గీ॥ మనకుమారుని భక్తుని ♦ మరచిరిట్లు
తగవులను గూర్చుకొంచును ♦ దనరుచున్న
ముక్తికల్గుట యెన్నఁడు ♦ ముదముమీర
రండు దీవింత మొకసారి ♦ రమ్యభక్తి!
గీ॥ వాదములు వృద్ధిసల్పెడు ♦ వాడటంచు
వాదునారదుపైసల్ప ♦ గాదువినుఁడు
నారదుండేది దలఁచిన ♦ నాయలార!
శాంతి నెలకొల్పనేగదా ♦ సదయులార!

గావున మీరింక మీవాదోపవాదంబులనుండి విరమించి మత్సద్భక్తివరేణ్యుండగు కుచేలుని మనసన్నిధిని జేర్పనుంకింపుడు.
(నలువురు వరుసగా నిలతురు అంత కుచేలుఁడు విమానమున వచ్చును
ప్రార్థనలతో తెరవ్రాలును.)

మంగళంమహాశ్రీ.

ఇది శ్రీసీతారామాంజనేయ కరుణాకటాక్షలబ్ధ కవితాధారేయ
శ్రీసృష్టికరణకుల, నాగేశ్వర గోత్రోద్భవ, వురిటి
వంశపయః పారావారరాకాసుధాకర అప్పన్న
పౌత్ర, నరసయ నరసమాంబా జ్యేష్ఠపుత్ర
శ్రీరామచరణ సేవాతత్పరబలరామ
కవికృత కుచేల నాటకం
సర్వము సంపూర్ణము.
షష్ఠాంకము.

---

అచ్చులోనున్నది. అచ్చులోన్నది. అచ్చులోనున్నది.

# నీచులెవరు?

(కర్త: పురిటి సూర్యనారాయణరావు.)

అను నీ చిన్నిపొత్తము ప్రతి యాంధ్రుడును జదివితీరవలసినదే! ఇందు సవర్ణ, యవర్ణ, భేదంబులును, తదితర యాధునిక దురాచారములను విపులంబుగా వ్రాయబడియున్న నీ పొత్తమునకు **0_4_0** అణాలు పోస్టు బిళ్ళలను పంపుకొనువారికి బుక్‌పోస్టుగా పంపబడును. నేడే వ్రాయ యత్నింపుడు? ఇందలి కొన్ని పద్యంబు లుదాహరణకే వేసితిమి; తిలకింపుడు.

(1) సీ. మహమ్మదీయుండన మనబాబు చుట్టమా
జంటగానుందురు యంటులేక?
క్రైస్తవజాతి ప్రశస్తమా మనకిల
జంటగానుందురు యంటులేక?
మద్యంబు సేవించి మనువారుబంధులా?
జంటగానుందురు యంటులేక?
సద్బ్రాహ్మణులమంచు పైకి చాటెడివారి
వెంటనుందు రిదేమి యంటులేక?
గీ. నీమములు దప్ప వీరలు నీచులెవరో?
"**మాల**" యనువారిఁ గాంచిన మండులగుచు
పరుగులిడుదురు ప్రక్కకు బాపమంచు
కటకటా! నీచులెవ్వరో? కనరుసుంతే!

(2) సీ. బాల్యవివాహముల్ ♦ బారదోలినగాని
పడతుల కష్టముల్ ♦ బాయవంచు?
వృద్ధవివాహ మిద్ధరను ♦ బాపినగాని
వ్యభిచారదోషంబు ♦ వదలదంచు?
అస్పృశ్య దోషంబు ♦ యవని ద్రోలినగాని
వాదోపవాదముల్ ♦ వదలవంచు?

మాంసభక్షు మహిలోన ♦ మానినగాని
బుద్ధి మాంద్యము భువి ♦ వీడదంచు

గీ. మద్యపానంబు వీడిన ♦ మంచిదంచు
వివిధవిషయోక్తులెల్లను ♦ వీనులలర
వినుడటంచును దెల్పిన ♦ వినరుజనులు
కటకటా ! నీచులెవ్వరో ! ♦ కనరుసుంత.

(3) సీ. మాలవానినిగాంచి మాలోనినాడరా
రాయంచు నోరార బలుకరయ్య
మాలదానినిగాంచి మహినాదరముజూపి
సత్ప్రవర్తనలన్ని నేర్పరయ్య
మాలవారలగూడి మద్యంబు మాన్పించి
రమ్ముసారను దుమ్ముసేయుఁడయ్య
మాలవారకును కలవిద్యలన్నేర్పి
నస్పృశ్యదోసము లణచుడయ్య

గీ. మహిననీతిని దప్పిన మాలగాఁడె?
నీతివిడనాడువారికి నీతిగఱపి
వరలు బుద్ధిని జనులకు ధరనొసంగి
పక్షపాతంబు మాన్పించు పరమపురుష!

(4) సీ. "కందుకూరి"ని జంప కడుపునిండెనెనీకు
బాలవిధవల మొర బాయుటెట్లు
"చిలకమర్తి"ని నంధు నిలజేసితేనీవు
అస్పృశ్య దోసంబు లణగుటెట్లు
"లచ్చరాయు"ని జంపి మెచ్చుకొంటివినీవు
కవికి సత్కారముల్ కలుగుటెట్లు
భావకవిత్వముల్ భాసురంబుగజెప్పు
ధరసత్కవీంద్రులెఁ దృంచియిట్లు

గీ. సంతసించుట నీకిది సముదయంబె ?
కన్నపుత్రుని జంపిన కుమతిభంగి

వరలుచుండిన మృత్యువున్ వసుధద్రుంచి
దేశరక్షణసేయవే దేవదేవ!

(5) సీ. మద్యంబు ప్రీతిని మహిఁ్రాగువారలే
అస్పృశ్యులనఁదగు నార్యులార
మాంసభక్షణమును మహిఁసల్పువారలే
అస్పృశ్యులనఁదగు నార్యులార
మాన విక్రియమును మహిఁసల్పువారలే
అస్పృశ్యులనఁదగు నార్యులార
తమదేశరక్షణ తామెసల్పకయున్న
అస్పృశ్యులనఁదగు నార్యులార

గీ. నీతివిడనాడివర్తించి నెవ్వఁడైన
యగ్రకులమునఁ బుట్టినవారలైన
నీచులనఁదగు వారలహీనగతిని
కడమజాతియటంచును గాంచుడయ్య వెల రు0-3-0



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B119 |
| పుస్తకం పేరు | భక్తకుచేల |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 83 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV, BCI, CI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | pravallika |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |